ఎఱ్ఱన - రసపోషణ
(ఎఱ్ఱన కృతులలోని రస సమీక్ష)

ప్రొఫెసర్ ఎస్. గంగప్ప, ఎం.ఏ., పిహెచ్.డి.,
యు.జి.సి. జాతీయాధ్యాపకులు,
అధ్యక్షులు, తెలుగు ప్రాచ్య భాషా విభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ – 522 510, గుంటూరు జిల్లా, ఆం.ప్ర.



ప్రథమ ముద్రణ : డిశంబర్ 1990

ప్రతులు : 1000

వెల : రూ. 25/-

ప్రతులకు :
శ్రీమతి ఎస్. పార్వతమ్మ
శశి ప్రచురణలు
సి–73 సుధర్మ,
శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు – 522 006

ఈ గ్రంథ ముద్రణకు రెండువేల రూపాయలు ఆర్థిక సాహాయ్య మందించినవారు, తెలుగు విశ్వవిద్యాలయము, ఆంధ్రప్రదేశ్.

ముద్రణ : విజేత ప్రింటర్స్, 3/1 బ్రాడీపేట, గుంటూరు - 2.

# విషయ సూచిక

# భూమిక

## 0.0

కావ్య ప్రయోజనాలలో రసానందం ప్రధాన లక్షణం; నీతి ప్రతిపాదకత గౌణం. కావ్య నిర్వహణ చణత్వం కవి ప్రతిభా నైపుణ్యానికి నికషోపలం. అది గూడా ఔచితీ సహమైన రసపోషణం కత్తి మీది సాము వంటిది. కవ్యభిపేత రసగ్రహణ పారీణుడైన వాడే సహృదయుడు. కావ్య విమర్శకు సహృదయత అవసరం. అప్పుడే సద్విమర్శ వెలువడగలదు. కాబట్టి కవ్యుద్దిష్టమైన రస సమీక్ష చేయడం సద్విమర్శకునకు గూడా కత్తి మీద సామే; లేనిదాన్ని అవిష్కరించయత్నిస్తే నేల విడిచి సాము చేసినట్లు అవుతుంది.: తదౌన్నత్యవ్యక్తీకరణ రహితమైన విమర్శ కవికి అన్యాయం చేసేదవుతుంది. అందుకే కావ్య విమర్శ కత్తి మీద సాము వంటిదని చెప్పడం.

## 0.1

కాగా 'ఎఱ్ఱన–రసపోషణ' శీర్షిక మెచ్చుట గొల్పేదిగా అనిపిస్తుంది. అయితే ప్రబంధాలలోని రస ప్రస్థానాన్నిగూర్చి చెప్పడం సులభమేమోకాని వాగనుశాసనుడైన నన్నయ, కవిబ్రహ్మ అయిన తిక్కన, వారితో కలిపి కవిత్రయంగా పేర్కొనబడే ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱన రసపోషణను గూర్చిన చర్చ అంటే సాహసోపేతమైన కార్యం. ఎఱ్ఱన కృతులన్నీ ఏమిటి? ఒక్క 'హరివంశమే'చాలు సక్రమమైన ఈ కార్యనిర్వహణకు. అయితే దీనితోపాటు నృసింహ పురాణం,అరణ్య పర్వశేషం రెంటు కృతుల్నీ గ్రహించి అంగాంగిరసభావాలను సమన్వయం చేయడం అత్యంత సాహసమంటే అత్యుక్తి కాదు. కావ్య గుణాల్ని, రీతుల్ని, అలంకారాదుల్ని వివరించడం వేరు. రస సమీక్ష సామాన్యం కాదు; సహృదయ హృదయావర్జకంగా ఉండడం ముఖ్యం; అది ఆయా కృతులలో ఉన్నదున్నట్లు చెప్పడం మరీ ముఖ్యం: అదే అత్యంత క్లిష్టవిషయం. అతివ్యాప్తి, అవ్యాప్తికి అవకాశమీకుండా రస సమీక్ష చేయడం అవసరం.

## 0.2

'ఎఱ్ఱన–రసపోషణ' అనే అంశాన్ని ఐదు ప్రకరణాలుగా విభజించడం జరిగింది.

మొదటి ప్రకరణంలో ఎఱ్ఱన ప్రాశస్త్యాన్ని గూర్చిన వివరణ ఉంది. ఎఱ్ఱన కవిత్రయంలో చేరడానికిగల అర్హత, ఎఱ్ఱన కాలాదికాలు, కృతుల పౌర్వాపర్యాలు, ఆతని కృతులలోని రసప్రసక్తి అనే అంశాల్ని క్లుప్తంగా వివరించాను.

రెండో ప్రకరణంలో ఎఱ్ఱన కృతులలోని రసాన్ని వివరించేముందు నేపథ్యంగా ఉండడం కోసం లాక్షణికుల మతానుసారం రస సమీక్ష క్లుప్తంగా చేయడం జరిగింది.

మూడో ప్రకరణం ముఖ్యమైంది. ఇందులో ఎర్రాప్రెగడ సాహిత్యంలోని నవ రసాల్ని, నవవిధ భక్తుల్ని, ఆరువిధాలైన భక్తుల్ని, మధురభక్తిని వివరించడం జరిగింది.

ఆ వెనుక నాల్గవ ప్రకరణంలో ఆయా కృతులలోని అంగాంగిరసభావ సమన్వయాన్ని గూర్చిన వివరణ ప్రాధాన్యం వహించింది.

ఐదవ ప్రకరణం ఎర్రన, సోమన, పోతనల గూర్చి ఇతఃపూర్వమే పెద్దలు చెప్పిన సుద్దులను–ముఖ్యంగా రసాన్ని గూర్చి–సంక్షిప్తంగా పేర్కొని నా అభిప్రాయం తెలుపడం జరిగింది.

## 0.3

ఇది నాయీ చిన్ని ప్రయత్నం యొక్క ప్రణాళిక. ఏవో కొన్ని పద్యాలుమాత్రమే లభిస్తూన్న రామాయణం వదలివేయబడింది. తక్కిన నృసింహపురాణం, అరణ్య పర్వ శేషం, హరివంశం—అనే ఎర్రన కృతులలోని రస ప్రస్థానాన్ని పరిశీలించడం జరిగింది. మరో విషయం. ఇందులో ఎర్రన అనువాదరీతి ప్రసక్తికి అవకాశం లేకపోయిందని మనవి.

## 0.4

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మి చూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేటపఱుతు" (1.17)

—ఇది భాగవత భక్తి తత్త్వాగ్రేసరుడు, హరిభక్త శ్రేష్ఠుడు అయిన పోతన వినయ పూర్వోక్తి. ఆ మహాత్మునకు మనకు హస్తిమశకాంతరం. అయినా "విబుధ జనుల వలన విన్నంత,కన్నంత, తెలియవచ్చినంత" నాబుద్ధికి తోచినరీతిని "ఎర్రన–రసపోషణ" ను గూర్చిన సమీక్ష చేయడానికి ప్రయత్నించాను. నాయీ రచన సహృదయ వతంసుల హృదయాలను ఆకట్టుకోగలిగితే ధన్యుణ్ణనీ, నాయీ కృషి సఫలమనీ భావిస్తాను। అలా కావాలన్నది నా అతిశయితమైన ఆకాంక్ష।

"రస సిద్ధాః కవీశ్వరాః॥

0.5

'వ్యాకరణ-రసపోషణ' వ్రాతప్రతిని పరిశీలించి ప్రశంసించిన పూజ్యులు శ్రీ స్ఫూర్తిశ్రీ గారికి నా కృతజ్ఞతలు।

శుద్ధ ప్రతిని సిద్ధం చేసిన మా అల్లుడు చి. డా॥ గుమ్మా సాంబశివరావు (లెక్చరర్, ఆంధ్ర లయోలా కాలేజి, విజయవాడ)కు, నా మేనల్లుడు చి॥ ఏ. క్రిష్టప్ప (అగ్రికల్చర్ డిపార్ట్మెంటు)కు, నా ఆశీస్సులు; చి॥ పి. శాంసన్ (లెక్చరర్, ఏ.సి. కాలేజి)కి శుభాకాంక్షలు.

ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీవిజేత ప్రింటర్స్ (3/1 బ్రాడీపేట) అధినేత శ్రీ కె.వి. సుబ్రమణ్యంకు, సిబ్బందికి అభినందనలు.

ఎస్. గంగప్ప

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁగ డంగు భంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దపారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తి సంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్"

(నృసింహపురాణము - 1.13)

# ఎర్రన - రసపోషణ

1.0 "ఆడుదు రెల్ల ప్రొద్దు లలితాభినయంబుల దేవకామినుల్
పాడుదురింపు వీనులకుఁబండువ సేయగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వ రసగోష్ఠి సుఖింతురు యోగి బృందముల్
క్రీడ యొనర్తు రిష్ట[1]రసకీర్తిత భంగిఁ ప్రసన్నులయ్యెడన్" (1-61)

ఇది ఎర్రన నృసింహపురాణంలోని పద్యం. ఇందులో ఎర్రన అష్టరసాల్ని పేర్కొన్నాడని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు. రసాలు తొమ్మిది అయినప్పటికి ఎర్రన ఎనిమిదింటినే పేర్కొనడంవల్ల బహుశః ఎర్రన తనకృతి నృసింహపురాణంలో శాంతం ప్రధాన రసంగా ఉద్దేశించి ఉండడం వల్లదాన్ని పేర్కొని ఉండలేదని అభిప్రాయపడ్డారు.[2] ఇది సముచితమనే భావించవచ్చు.

## 1.1 ఎర్రన ప్రాశస్త్యం :

ఎర్రన తెలుగు సాహిత్యంలో ప్రముఖ కవి. ఆర్ష సాహిత్యాన్ని తెలుగు వారికి అందించిన కవిత్రయంలో మూడవవాడు. నన్నయ తిక్కనలు భారతానువాద విధానంలో చక్కటి బాటలు వేసి తీర్చిదిద్దగా ఆమార్గాలనే అనుసరించి వారితో సమాన ప్రతిపత్తితో కృతులు రచించి ఎర్రన తన ప్రత్యేకతను సైతం నిలబెట్టుకొన్న మహాకవి. నన్నయ తెలుగున పద్యవిద్యకు ఆద్యుడు కాగా, తిక్కన తెలుగు లుకుబడి నుడుకారాలను పరిరక్షించి తెలుగు దేశీయతను రసాభ్యుచిత బంధంతో ...త్యాన్ని ప్రసాదించి తెలుగు సాహిత్యానికి సమున్నత సేవ చేసిన విషయం సర్వపండిత లోకానికి సువిదితమే. అటు నన్నయ మార్గాన్ని, ఇటు తిక్కన తీర్పును రెండు రీతులను సమ్మేళన చేసి తెలుగు కవిత్వ పటుత్వ రచనాధురంధరుడైన ప్రబంధ పరమేశ్వరుడు ఎర్రన. ఈ విషయాన్నే ఎర్రన తన హరి వంశంలో నన్నయ తిక్కనలను గూర్చి ఇలా స్తుతించడం జరిగింది.

"ఉన్నత గోత్ర సంభవము నూర్జిత సత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్య పరిభావిమదోత్కటమున్నరేంద్ర పూ
జోన్నయనోచితంబునగు యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్ని నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్"[3]

"తన కావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు నా నే ముఖం
బున ద్వాదల్కిన పల్కులాగమములై పొల్పొందు నా వాణిభ
ర్తను(?) నీతం డొకరుండ నాఁ జను మహత్త్వాప్తిన్ గవిబ్రహ్మ నా
వినుతింతున్ గవి తిక్కయజ్వనఖిలోర్వీ దేవతాభ్యర్చితున్"4

ఈ స్తుతి ఎఱ్ఱనకు వారిపైగల భక్తి ప్రపత్తులకు నిదర్శనం.

ఆదికవి నన్నయతో ఆరంభమైన తెలుగు కవితా కన్య తిక్కనతో తెలుగు బిగి బిగి బింక పొంకాలతో, తెలుగు దనం సింగారంతో అలంకృత అయి రసానందానికి తావలమైంది. నన్నయ్య పూర్వం తెలుగుభాష ప్రజల వాడుకలోను, కవిత ఆశువుగాను ఉండిపోయింది. జానపదుల నోళ్ళలో పాటల రూపంలో ఉండి పోయిందేగాని క్రమ పద్ధతి గాని, కావ్యస్థితిగాని పొందలేదు. పండితుని ఆమోదంగాని, రాజుల ఆదరణగాని లభించలేదు. కాని క్రమంగా ఇవి లభించి శాసనస్థమై, రాజరాజ నరేంద్రుని ఆదరణతో నన్నయ మూలంగా కావ్యస్థితిని పొందింది. ఈ విషయాన్నే ఎఱ్ఱన—

"భాసుర భారతార్థముల భంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గ్గాసట బీగుచే చదివి గాథలు ద్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగ జేసనట్టి య
జ్ఞాసన కల్పులం దలతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్"5

—అని సంస్మరించి నాటి స్థితిని సైతం స్పష్టం చేయడం జరిగింది. "నన్నయభట్ట మహా కవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి దన్ను జెందుటయు", "తక్కవితారీతియు గొంత దోప తద్రచనయకా నారణ్య పర్వ శేషము పూరించి"6 నట్లు ఎఱ్ఱన స్వయంగా చెప్పుకొన్నాడు. హరివంశ నృసింహ పురాణాలకు కర్త అయి కీర్తి గడించాడు. కవి త్రయంలో ఒకడయ్యాడు.

"భారత కావ్యహారమొక భాగము నన్నయ భట్టొనర్చె ము
క్తారమణీయ వాక్యముల దక్కిన భాగము సోమయాజి సొం
పార నొనర్చె రెంటి గలయన్ శివదాసుడు మధ్య నాయక
శ్రీ రచియించె శారద ధరింప గవిత్రయ కీర్తి మించగాన్"7

సరస సాహిత్య నిర్మాత అయి తెలుగు వాఙ్మయ చరిత్రలో ఎఱ్ఱన యుగకర్తగా ప్రసిద్ధుడయ్యాడు.

## 1.2 ఎఱ్ఱన వంశం - కాలం

ఎఱ్ఱన తల్లిదండ్రులు పోతమాంబికా సూర్యనార్యులు. పేరమాంబ ఎరపోత సూరి అనేవారు ఇతని పితామహులు. ఈ ఎరపోతసూరి వేగినాట కరాప్రత్తి - వృత్తి మంతుడని, పూర్ణ పురుషాయుష జీవిత ధన్యుడని ఆ మహానుభావుని పేరే తనకు పెట్ట బడిందని ఎఱ్ఱన నృసింహ పురాణంలో వివరించాడు.[8] ఇతని వంశీయులు ఆపస్తంబ సూత్రులు; శ్రీవత్సగోత్రులు."అరణ్య పర్వ శేషము పూరించునప్పుడు ఎఱ్ఱన పాకనాటి యందలి గుడ్లూరు గ్రామమున నివసించు చుండెనని తెలియుచున్నది. సూరకవి కాల ముననో తర్వాతనో ఆ కుటుంబమువారు కరాప్రత్తినుండి గుడ్లూరుకి తమ నివాసమును మార్చియుందురు. ఎఱ్ఱాప్రెగ్గడ వేమారెడ్డి సోదరుడైన మల్లారెడ్డితోఁ బరిచయ మేర్ప డిన పిమ్మట నతనితో చెదల్వాడ కరిగి వేమారెడ్డి యాస్థానమున కవియై రామాయణ హరి వంశములను రచించు కాలమున రాజధానియైన అద్దంకిలో కొంతకాలముండి వార్ధక్యమున మరల చెదల్వాడకు వచ్చి యుండునని యూహింపవచ్చును."[9] ఎఱ్ఱన నృసింహ పురాణావతారికలో "యామము లెన్మిదింట...."[10] అనేపద్యంలో తనగురువు శంకరస్వామిని పేర్కొన్నాడు. ఇతడు శంభుదాసుడగుటకు తన గురువే కారణము కావచ్చును.

ఎఱ్ఱన ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి, రామాయణ హరివంశాలను ప్రోలయ వేమునికే అంకితమిచ్చినట్లు స్పష్టమే. ప్రోలయ వేమారెడ్డి అద్దంకి రాజధానిగా 1325_ 1355 వరకు రాజ్యం చేశాడు. ఇతని కనిష్ఠ సోదరుడు మల్లారెడ్డి. ఇతడు కురుమలూరికి అధిపతి. మల్లారె ఎఱ్ఱనను మొదట ఆదరించి చదలవాడలో రామాలయం నిర్మించాడు. ఆ సందర్భంలో వేమారెడ్డి చదలవాడకు వేంచేసి తమ్ముడు కట్టించిన రామాలయానికి ఒక అగ్రహారం దానమిచ్చాడు. ఈ అగ్రహారానికే మల్లారెడ్డిపేర మల్లవరం అనిపేరు వచ్చింది. బహుశః ఈ సందర్భంలోనే ఎఱ్ఱనను అన్న ఆస్థానంలో నియమింప చేసి ఉండవచ్చు. ప్రోలయ వేముని మరణానంతరం కూడ ఎఱ్ఱన జీవించినట్లు కొల్లూరనే గ్రామాన్ని అనవేముడు ఎఱ్ఱనకు ధారపోసినట్లు కొల్లూరు శాశనంవల్ల తెలుస్తుందని నోరి నరసింహశాస్త్రిగారి అభిప్రాయం.[11] ఇందువల్ల ఎఱ్ఱన అనవోతారెడ్డి కాలంలోనే కాక (1353-1364) అతని తమ్ముడైన అనవేముని రాజ్యకాలంలో (1364_1386) కొన్ని సంవత్సరాలు జీవించినట్లు చెప్పవచ్చు. అంటే ఎఱ్ఱన కాలం 1280_1364 అని నిర్ణయించడంలో విప్రతిపత్తి లేదు.

ఎఱ్ఱన కృతులు నాలుగు. అందులో రామాయణము అలభ్యం. హరివంశము, భారతారణ్య పర్వశేషము, నృసింహ పురాణము లభ్యమౌతున్న కృతులు. వీటిలో రామాయణం మొదటిది. హరివంశ భారతారణ్య పర్వశేష, నృసింహ పురాణాలు క్రమం గా రచించి ఉంటాడని ఎఱ్ఱన రచనా రీతివి, "నాతమ్ముండు ఘనుండు మల్లరధినీ నాథుండు....12" "ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి పదంబుల కావ్యకర్తవై ...13" అనే పద్యాలవల్ల స్పష్టమౌతుంది. "మొదటిజంట అనగా రామాయణ హరి వంశములు రెండును ప్రోలయ వేమారెడ్డికి అంకితములు. రెండవ జంట భారత నృసింహ పురాణ ములలో మొదటిది స్వార్థ నిరపేక్షమైన నిష్కామకర్మ. రెండవది పారమార్థిక చింత నతో చేసిన ఈశ్వరార్పణము(అహోబల నృసింహస్వామి కంకితము). మానవ స్వభా వమును బట్టి యాలోచించినచో రాజాశ్రయమును ధనార్జనమును ఆశించి రచించినజంట మొదటిదనియు ఐహిక భోగ చింతలేని పారమార్థిక దృష్టితో రచించినది రెండవ జంట యనియు విశదమగును." "రామాయణము14 లభింపలేదు గనుక తక్కిన గ్రంథము లను పరిశీలక బుద్ధితో చదివినచో హరివంశపు శైలి కంటె భారత శైలియు, దానికంటె నృసింహ పురాణ శైలియు మేలు రములుగా నుండుటనుట సత్యదూరముకాదు. అంతే గాక వాఙ్మనస వ్యాపారములు, కవికి పరిపక్వమైన దశలో వ్రాసిన కావ్యము నృసింహ పురాణమని అందలి యే పద్యమైనను దృష్టాంతమగును. కావున రామాయణ హరి వంశములు రచించిన పిమ్మటనే శంభుదాసుడు భారత నృసింహ పురాణములను రచించి చరితార్థుడయ్యెనని నాతలంపు"14 ఇది సమంజసమని సర్వపండిత లోకానికి సువిదితమే.

## 1.3 ఎఱ్ఱన బిరుదులు :

నన్నయకు ఆదికవి, వాగను శాసనుడు, తిక్కనకు కవిబ్రహ్మ, ఉభయకవి మిత్రుడు అనేబిరుదులు ఉన్నట్లే ఎఱ్ఱన కృతుల సాక్ష్యాధారంగా శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు అను బిరుదులు ఉన్నట్లు . హరివంశ నృసింహ పురాణాలలోని ఆశ్వాసాంతాలలో "శ్రీ శంకర స్వామి యమీశ్వర చరణ సరోరుహధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీసూర్యకవి మిత్ర సంభవ శంభుదాస లక్షణాభిధేయ ఎఱ్ఱన నామ ధేయ"

"యామము లెన్మిదింటనియతాత్మతి ప్రత్యహమున్ శివార్చనా
రామత యొప్ప నిత్య శివరాత్రి వ్రతంబుగఁబూని భవ్యయో
గామృత తృప్తి మైఁద్రిజగదర్పిత లీలఁదనర్చు శంకర

స్వామి మునీంద్రు భక్త జనవత్సలు మద్గురు నాశ్రయించెదన్"[15] అని చెప్పు కొనుట వల్లనూ, ఇంతేగాక

"గిరిశ పదభక్తి రసత
త్పరభావము కలిమి శంభుదాసుండనగాఁ
బరగియు గోవింద గుణా
దర సంభృత సౌమనస్యధన్యుఁడవెందున్"[16]

—అని తన తాత చేత ప్రశంసింపబడటం వల్లనూ, శంభుదాసుడనే బిరుదు ప్రసిద్ధమని తెలుస్తుంది.

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులఁగావ్యకర్తవై
యెన్నికమెఁ ప్రబంధ పరమేశ్వరుఁడనంగ నరణ్య పర్వ శే
షోన్నయ ంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించి తా
నన్నయభ తిక్క కవినాథుల కెక్కిన భక్తి పెంపునన్"[17]

—అనే పద్యం వల్ల ఎర్రనకు ప్రబంధ పరమేశ్వరుడన్న బిరుదు ఉన్న విషయం స్పష్టమే. అయితే భారతారణ్య పర్వశేషం ప్రస్తుతం శబ్దార్థంలో ఉన్న ప్రబంధమన డానికవకాశంలేదు. నన్నయది కథాకథన శైలి. తిక్కనది నాటకీయ శైలి. ఎర్రనది వర్ణనాత్మక శైలి. ఎర్రన రచించిన హరివంశము పురాణము. నృసింహ పురాణము కూడ క్షేత్ర మాహాత్మ్యమును తెలిపే పురాణమే. అరణ్య పర్వ శేషం భారతేతిహాసం లోని భాగం. ఐనప్పటికీ ప్రబంధానికి గల లక్షణాలలో ప్రధానమైంది వర్ణన. అలాంటి వర్ణనాత్మక శైలీ సంశోభితుడైన ఎర్రనను ప్రబంధ పరమేశ్వరుడనడంలో అతిశయో క్తి లేదు. హరివంశములోని వర్ణనలు గాని చివరికి అరణ్య పర్వ శేషంలోని కొన్ని ప్రముఖ ఘట్టాల్లోని వర్ణనలుగాని పరిశీలించినప్పుడు ఆ వర్ణనలు కంటికి కట్టినట్లుం దృశ్య సాక్షాత్కారంచేసి ఎర్రన వర్ణనా వైదగ్ధ్యాన్ని సుస్పష్టం చేయక మానవు.కాబ ఎర్రనకుగల బిరుదులు నేతి బీరకాయల్లాగ కాక సార్థకాలని మనకవగతమౌతుంది.

## 1.4 రస ప్రసక్తి

పైని పేర్కొన్న వాటికి ఉపబలకంగా మరికొన్నింటిని ఉదాహరించవచ్చు.కావ్య ప్రయోజనం ఆనందం. అంటే రసానందం. కావ్య రసాన్ని గూర్చి నృసింహపురాణా తారికలో

"వీనుల తేనెయై కురియ వింతగు కావ్యరసంబు గ్రోలి...."[18]

"మనసు వికసిల్ల కనువిచ్చి మహితలీల నద్భుతానందరస మూర్తినై ...."[19]

—అని ఎఱ్ఱన చెప్పుకోవడం వల్ల తాను రచించినవి పురాణాలే అయినప్పటికీ అవి కావ్యాలనీ అంటే ప్రబంధాలనీ తన్మూలంగా దాని ప్రయోజనం రసానందమని ఉద్దేశించినట్లు మనం గ్రహించవచ్చు.

"ఆడుదురెల్ల ప్రొద్దు లలితాభినయంబుల దేవ కామినుల్
పాడుదురింపు వీనులకుఁ బండువ సేయఁగవేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వ రసగోష్ఠి సుఖింతురు యోగి బృందముల్
క్రీడ యొనర్తు శిష్ట[20]రస కీర్తితభంగి ప్రసన్నులయ్యెడన్"[21]

"క్రమ పాకంబునఁ గెంపుతోడి నలుపెక్కి న్నిక్కుటంబైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రసమంతర్గామి యయ్యున్నెఱిం
గమియం గాఱుచునున్న చాడ్పున విలోకప్రీతి గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలములీ తాళద్రుమ శ్రేణులన్"[22]

ఎఱ్ఱన కృతులలోని రస ప్రస్థానాన్ని గూర్చి పరిశీలించేముందు లాక్షణికులుచేసిన రస చర్చను సమాలోచించడం సముచితమే.

## సూచికలు

1. రష్ట (పాఠాంతరము)
2. నృసింహ పురాణము పీఠిక–పుట 40–42
3. హరివంశము పూ.భా 1–8
4. ,, ,, 1–9
5. నృసింహ పురాణము 1–9
6. అరణ్య పర్వశేషము
7. ఎల్లనార్యుడు చింతలపూడి, రాధామాధవము, పీఠిక
8. నృసింహ పురాణము 1–55
9. ,, ,, పీఠిక పు–2

10. ,, ,, 1_11
11. తెలుగు విజ్ఞాన సర్వస్వము సం. 4 పు_734
12. హరివంశము పూ.భా. 1—39
13. ,, ,, 1_17
14. వింగళి లక్ష్మీకాంతము, ఆంధ్ర సాహిత్య చరిత్ర పు 276_280
15. నృసింహ పురాణము 1_11
16. ,, ,, 1—18
17. ,, ,, 1_17
18. ,, ,, 1—7
19. ,, ,, 1_22
20. రష్ట (పాఠాంతరము)
21. నృసింహ పురాణము 1_61
22. హరివంశము పూ.భా. 7—77

# 2. రస సిద్ధాంతం

## 2.0

ఎఱ్ఱాప్రెగ్గడ సాహిత్యంలోని రసప్రస్థానాన్ని వివరించేముందు రస సిద్ధాంతాన్ని సమీక్షించడం అవసరం. తన్మూలానా ఇది తరువాతి ప్రకరణానికి నేపథ్యంగా ఉంది. ఎఱ్ఱన కృతులలో రస సమన్వయానికి ఉపకరించి విస్పష్టీకరించగలదు.

ప్రస్థానమంటే ప్రయాణమనీ, సంప్రదాయమనీ, సిద్ధాంతమనీ, మతమనీ అర్థం రస ప్రస్థానమంటే రససిద్ధాంతమని గ్రహించడం సముచితం. ఎఱ్ఱన కృతులలోని రస సిద్ధాంత పరిశీలనమని విదితమవుతుంది. కావ్య పరమ ప్రయోజనం రసానందం; నీత్యు పదేశం గౌణం. అయితే ఎఱ్ఱన కృతులన్నీ పురాణ సంబంధేతి వృత్త సమన్వితాలు.

ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితుడై తన కృతులను ప్రబంధాలని ఎఱ్ఱన పేర్కొన్న విషయం పూర్వోక్తం. అంటే ఇక్కడ కావ్య ప్రబంధాలు సమానార్థకా లుగా గ్రహించడంలో దోషంలేదు. వేదాలు ప్రభు సమ్మితాలనీ, పురాణాలు మిత్ర సమ్మితాలనీ, కావ్యాలు కాంతా సమ్మితాలనీ ప్రసిద్ధమే. కాంతాసమ్మితాలైన కావ్యాలధ్వని వ్యంగ్య రస ప్రధానాలు. ఎఱ్ఱన కృతులు పురాణేతి వృత్తాలే అయినప్పటికీ వాటిలో కావ్యలక్షణాలు తొణికిసలాడుతూ ఉండడం వల్లా వాటిలో ఎఱ్ఱన నిర్వహించిన రస సిద్ధాంతాల్ని సమీక్షించడం ఎంతైన సముచితం. అంతకంటే ముందు రస సిద్ధాంతాల్ని గూర్చి లాక్షణికులు నిర్వచించిన తీరుతెన్నులను పరిశీలించడం అవసరం.

## 2.1 రస ప్రాధాన్యం

సహృదయ పాఠకునిచే కావ్యం పఠింప బడినప్పుడు కలిగే ఆనందమే రసా నందము. అందుకే "రస్యతే యితి రసః" అని చెప్పబడింది. "రసోవై సః రసంహ్యే వాయం లబ్ధ్వానందీ భవతి"[1] అంటే పరమాత్మయే రసమని అర్థం. అందుకనే కావ్యా నందాన్ని బ్రహ్మానంద సహోదరంగా లాక్షణికులు పేర్కొన్నారు. ఈవిషయాన్నే భరత మహర్షి కావ్యపరంగా "నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే"[2] రసం లేకుండా కావ్యా ర్థమే లేదని తెలుపడం గమనించదగ్గది. 'వాక్యం రసాత్మకం కావ్యం' అని విశ్వనాథు ని నిర్వచనం.

సర్వ పండిత సమాదరణీయంగా మరింత క్లుప్తంచేసి జగన్నాథ పండిత రాయలు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' అని చెప్పడం కావ్యరస వైశిష్ట్యాన్ని నిరూ పించేదిగా ఉంది.

"విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిశ్రుతౌ చవాగర్థౌ
సావాగ్యా రస వృత్తిః సాధ్యోహిరసో యథాతథం కవిభిః"[3]

—ఈ శ్లోకం వల్ల కావ్య ప్రపంచ స్రష్టలైన కవులు రసద్రష్టలు కావాలని కావ్యాలు రస పరిప్లుతాలై యుండాలని స్పష్టమౌతుంది. S.K. దే పపండితుడు సైతం—

"The theory cf Rasa, like the theory of dhvani with which is intimately connected forms one of the most mportant aesthetic foundations of Sanskrit Poeties. From its first appearence in the dramatic theory of Bharata down to its establishment as a soul of Poetry in the work of Viswanatha there has been a steady working out of the idea into a fundamental aesthetic coneept[4]" అని వక్కాణించడంవల్ల పై విషయాన్ని స్థిరపరచినట్లు గమనించవచ్చు.

## 2.2 రస సంఖ్య

భరత మహర్షి నాట్య శాస్త్రంలో రసాలు ఎనిమిది అని పేర్కొన్నాడు.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌచేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః"[5]

—కాని పాఠాంతరములో తొమ్మిది రసాలుండటం గమనించదగ్గ విషయం.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీరభయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చనవ నాట్యేరసాః స్మృతాః"

—వీటి స్థాయి భావాల్ని సైతం భరతుడు పేర్కొన్నాడు.

"రతిర్హాసశ్చ శోకశ్చక్రోధోత్సాహౌభయం తథా
జుగుప్సావిస్మయ శమాః స్థాయి భావా నవ క్రమాత్"

ఇదిలా వుండగా రుద్రటుడనే లాక్షణికుడు స్నేహ స్థాయికమైన ప్రేయోరసాన్ని చేర్చి పది రసాలుగా పేర్కొన్నాడు. సాహిత్య దర్పణ కర్త విశ్వనాథుడు వాత్సల్యం రసమనీ దానికి ప్రేమ యుక్త రతి స్థాయిఅనీ తెల్పగా, జగన్నాథ పండితరాయలు వాత్సల్యం భావ మాత్రమనీ రసం కాదనీ నిర్ధరించాడు. ఉజ్జ్వల నీలమణి కర్త రూప గోస్వామి భక్తిరసాయన కర్త మధుసూదన సరస్వతి భక్తిని రసంగా పేర్కొన్నారు. ధనంజయ జగన్నాథ పండితరాయలు ,కొందరు తదితరులు భక్తి భావమనీ రసం కాదనీ

నిర్ద్వంద్వంగా చెప్పారు. భట్టలోల్లటుడు రసాలు అనంతములని పేర్కొన్నాడు. భోజ దేవుడు శృంగారమొకటే రసమనీ

"అమ్నాశిషుర్దశ రసాన్ సుధియో వయంతు
శృంగార ఏవ రసనాత్ రస మామ నామః"[6]

—అనే శ్లోకంలో సిద్ధాంతీకరించాడు. కాని భవభూతి ఉత్తర రామచరిత్రలో

"ఏకోరసః కరుణ ఏవ నిమిత్త భేదాత్
భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్
ఆవర్తం బుద్బుద తరంగమయాన్ వికారాన్
అంభోయథాసలిల మేనహి తత్సమస్తమ్"

—కరుణ రసం ఒక్కటే రసమనీ పేర్కొన్నాడు.

## 2.3 నవ రసాలు

### శృంగారం :

విభావాను భావ వ్యభిచారీ భావాల సంయోగం వల్ల రస నిష్పత్తి అవుతుందనీ

"విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః"[7]

—భరతుని రస నిష్పత్తి సూత్రం. ఇట్లే విభావాను భావ సాత్త్వీక వ్యభిచారి భావాల చేత ఆస్వాద్యమానమైన స్థాయి భావమే రసమనీ దశ రూపక కర్త ధనంపయుని నిర్వచనం.

"విభావై రను భావైశ్చ సాత్త్వి కై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయి భావో రసఃస్మృతః"[8]

—స్థాయి అంటే స్థిరంగా ఉండేది. స్థాయిభావమంటే రసస్ఫూర్తి వరకు సహృదయ హృదయాలలో నిలిచి ఉండేది. విభావం ఆలంబన విభావమూ, ఉద్దీపన విభావమూఅని రెండు విధాలు. నాయికా నాయకులు ఆలంబన విభావం. రసాన్ని ఉద్దీపింప జేసేది ఉద్దీపన విభావం. ఇది సహజమూ, తటస్థమూననీ రెండువిధాలు. యౌవనం, భూషణాలు, చేష్టలు మొదలైనవి సహజోద్దీపన విభావాలు. మలయానిలం, చంద్రుడు తటస్థోద్దీపన

విభావాలు. విభావం కారణ రూపంతోను, అనుభావాలు కార్య రూపంగాను ఉంటాయి. మనోభావాలైన హావభావాదులూ, అయత్నజాలైన శోభా, కాంతి, దీప్తి మొదలైనవీ, స్వభావజాలైన లీలా,విలాసం మున్నగునవీ సాత్విక భావాలనబడతాయి. ఇతర శృంగార చేష్టలు అనుభావాలనబడతాయి. నాయికా నాయకుల హృదయాలలో పుట్టే సంభోగ సంబంధి అభిలాష లేక కామానికి రతి అనిపేరు. స్త్రీ పురుషుల పరస్పరాలంబనం గల ప్రేమాఖ్య చిత్త వృత్తి విశేషం రతి అని రసగంగాధరంలో చెప్పబడింది. ఈ రతి అంకుర పల్లవ కలికా ప్రసూనఫల భోగావస్థలలో ప్రేమ, మానం,ప్రణయం,స్నేహం, రాగం, అనురాగం అనే పేర్లతో పేర్కొనబడుతుంది. ఈ ఆరు అవస్థలలోను మొదటి ఐదవస్థలూ పూర్వరాగంలోను, ఆరవ దైవ భోగం సంభోగంలోను కలుగుతుందని లాక్షణికుల వివరణ. ఈ శృంగార రసం_సంభోగ శృంగారం. విప్రలంభ శృంగారం అని రెండు విధాలు. సంభోగ శృంగారం కేవలం సురతరూపంలోనేగాక దర్శనం, ఆలింగనం, చుంబనం మొదలైన అనేక విధాలుగా ఉన్నా వీటన్నిటినీ కలిపి సంభోగ శృంగారమే అంటారు విప్రలంభమంటే వియోగం. ఇది అభిలాష (అయోగ ?క పూర్వరాగ) విప్రలంభం, మాన, (ఈర్ష్య) విప్రలంభం, విరహ విప్రలంభం ప్రవాస లంభం—అని నాలుగు విధాలు. మాన విప్రలంభం_ప్రణయ మానమూ ఈర్ష్యమానమూ అని రెండు విధాలు. ఇట్టి శృంగార రసం ఇన్ని విధాలుగా నిర్వచించబడి విస్తరించి ఉంది. ఇది రసరాజం గదా: శృంగార రసంతోపాటు తదితర రసాలను గూర్చి తెలుసు కొందాం. సన్నిధానం సూర్య నారాయణ శాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహ వివరణ లోని అంశాల్నే యిందులో గ్రహించడం జరిగింది.[9]

హాస్య రసం :

> "వికృతాకార, వాగ్వేష, చేష్టాదేః
> కుహకాద్భవేత్ హాస్యోహాస స్థాయి భావః"

—వికృతాకారం, వాక్కు, వేషం, చేష్టలు మూలంగా నర్తకుని వల్ల కలిగేది హాస్య రసం. హాస్యానికి స్థాయి భావం హాసం.

కరుణ రసం

> ఇష్టనాశా దనిష్టాచ్చ కరుణాఖ్యోరసో
> భవేత్‌శోకో౽ త్ర స్థాయి భావః"

ఇష్ట బంధువులు మొదలైనవారి నాశనం వల్లగాని అనిష్టప్రాప్తి వల్లగాని కరుణ రసం ఉత్పన్నమవుతుంది. దీని స్థాయీ భావం శోకం.

### రౌద్ర రసం :

"రౌద్రః క్రోధస్థాయి భావః"

రౌద్ర రసానికి క్రోధం స్థాయి భావం. ఈ క్రోధం వల్లనే రౌద్ర రసం ఉత్పన్న మౌతుంది.

### వీర రసం :

"ఉ మ ప్రకృతేర్వీర ఉత్సాహ స్థాయి భావకః"

—వీర ర ం ఉత్తమ నాయకాశ్రయం. దీనికి స్థాయిభావం ఉత్సాహం. వీరం ధర్మ వీరమనీ, యుద్ధ వీరమనీ, దాన వీరమనీ, దయా వీరమనీ నాల్గురకాలు.

### భయానక రసం :

"భయానకో భయస్థాయి భావః" భయానక రసానికి భయం స్థాయి భావం.

### బీభత్స రసం :

"జుగుప్సా స్థాయి భావశ్చ బీభత్సః కథ్యతే రసః" బీభత్స రసానికి జుగుప్స స్థాయి భావం.

### అద్భుత రసం :

"అద్భుతో విస్మయ స్థాయి భావః" అద్భుత రసానికి విస్మయం స్థాయి భావం

### శాంత రసం :

"శాంతశ్శమ స్థాయి భావ ఉత్తమ ప్రకృతిర్మతః" శాంత రసానికి శమం స్థాయి భావం. అది ఉత్తమ నాయకా శ్రయం.

## 2.4 రసాభాసం :

"అనుచిత విభావాలంబ నత్వం రసాభాసత్వం"

—"అనుచితమైన విభావనం ఆలంబనము కలది రసాభాసం" అని జగన్నాథ పండిత రాయలు రసగంగాధరంలో వివరించాడు. ఈ రసాభాసమనేది అన్ని రసాల్లోను ఉంటుంది.

"ఏకత్రై వాను రాగశ్చేత్తిర్య జ్మేచ్ఛగతో౽పివా
యోషితో బహు సక్తిశ్చేద్ర సాభాసస్త్రిధామతః"

నాయికా నాయకులలో ఒకరి యందు మాత్రమే అనురాగం గానీ, పశు పక్ష్య మ్లేచ్ఛ గతమైన అనురాగంగానీ, బహునాయకానురాగం గానీ శృంగారం రసాభాసం ఔతుంది. అపహసింపదగని గురువులు మొదలైన పెద్దలు ఆలంబనమై నిష్పన్నమయ్యే హాసం హాస్యాభాసం. ధీరోద్ధతుడు తన చేత చంపపడిన శత్రువుని గూర్చి రోదిస్తే కరుణా భాసం. గురువులకు పితృభ్రాతృమునిసుర ఆచార్యాదులపై కోపం చూపించడం రౌద్రా భాసం. బ్రహ్మహత్యాదులైన మహా పాతకాలు చేయడానికి చూపే ఉత్సాహం అధమ పాత్రలలో చూపే వీరం వీరాభాసం. భయానకం ఉత్తమ పాత్ర గతమయితే భయానకాభాసం. సుందర వస్తువులను గురించి జుగుప్స పూనటం బీభత్సాభాసం. అలౌ కోత్తర వస్తువుల్ని చూచి విస్మయం చెందడం అద్భుతాభాసం. హీన నిష్ఠమైన శాంతం శాంతాభాసం.

## 2.5 భక్తి – మధుర భక్తి :

'భక్తి' అన్నది 'భజ్' ధాతువు నుంచి పుట్టింది. అంటే భజించడం, భగవద్భ జనమన్నమాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదార విందాల కడకు పోవడాన్నే 'భక్తి' అంటాడు శంకరాచార్యులు.

"అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతో పలం సూచికా
సాధ్వీనైజ విభుం లతా క్షితిరుహం సింధుస్సరి ద్వల్లభమ్
ప్రాప్నోతీహ యధాతథాపశుపతేః పాదార వింద ద్వయం
చేతోవృత్తి రుపే త్యతిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే"10

నారద భక్తి సూత్రాలలో 'సాతస్మిన్ పర(మ) ప్రేమ రూపా (సూ. 2) (ఆ భక్తి పరమేశ్వరుని యెడల పరమ ప్రేమ రూపంగా ఉంది) అని కలదు. అంటే 'ఈశ్వరుని యెడల గల యుత్తమమగు ప్రేమ యేదియో అదియే భక్తి యనబడును.11(సూ.2)

అంటే భగవంతుని యెడగల పరమప్రీతి (గాఢాను రాగం) భక్తి అని చెప్ప బడింది. పరమ పూజ్యమైన ప్రీతి యే భక్తి-భగవంతుని యెడగల ఆ పరమ పూజ్య భావమే భక్తి. ఇది తొమ్మిది విధాలు:

"వీనుల తేనెయై కురియ వింతగు కావ్యరసంబు గ్రోలి...."[18]

"మనసు వికసిల్ల తనువిచ్చి మహితలీల నద్భుతానందరస మూర్తినై ...."[19]

—అని ఎర్రన చెప్పుకోవడం వల్ల తాను రచించినవి పురాణాలే అయినప్పటికీ అవి కావ్యాలనీ అంటే ప్రబంధాలనీ తన్మూలంగా దాని ప్రయోజనం రసానందమని ఉద్దేశించినట్లు మనం గ్రహించవచ్చు.

"ఆడుదురెల్ల ప్రొద్దు లలితాభినయంబుల దేవ కామినుల్
పాడుదురింపు వీనులకుఁ బండువ సేయగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వ రసగోష్ఠి సుఖింతురు యోగి బృందముల్
క్రీడ యొనర్తు రిష్ట[20]రస కీర్తి తభంగి ప్రసన్నులయ్యెడన్"[21]

"క్రమ పాకంబునఁ గెంపుతోడి నలుపెక్కఁ న్నిక్కుటంబైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రవమంతర్గామి యయ్యున్నెలం
గమియం గాఱుచునున్న చాడ్పున విలోకప్రీతి గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలములీ తాళద్రుమ శ్రేణులన్"[22]

ఎర్రన కృతులలోని రస ప్రస్థానాన్ని గూర్చి పరిశీలించేముందు లాక్షణికులుచేసిన రస చర్చను సమాలోచించడం సముచితమే.

## సూచికలు

1. రష్ట (పాఠాంతరము)
2. నృసింహ పురాణము పీఠిక_పుట 40_42
3. హరివంశము పూ.భా 1_8
4. ,, ,, 1_9
5. నృసింహ పురాణయ 1–9
6. అరణ్య పర్వశేషము
7. ఎల్లనార్యుడు చింతలపూడి, రాధామాధవము, పీఠిక
8. నృసింహ పురాణము 1_55
9. ,, ,, పీఠిక పు_2

### మధురభక్తి :

భగవంతుని పురుషునిగా ఇతర జగత్తంతా స్త్రీ సమానంగా భావించి పూజించే సంప్రదాయమే మధురభక్తి సంప్రదాయం. ఈ మధుర భక్తిని గూర్చి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి మాటలు పేర్కొనడం ఉచితం. "ప్రేమ మిశ్రిత భక్తియే మధురాతి మధురరసముగా పరిణమించును. ఆ భక్తుడు తాను ప్రేయసిగా, భగవంతుడు తన కౌగిలిలో చేరినట్లు మానసిక సంయోగ సుఖము ననుభవించును. ఆక్షణములో అతనికి సాయుజ్య సుఖము కలుగును. జీవన్ముక్తుడగును. అట్టి భక్తుడు చేసెడి చేష్టలు, పలికెడు మాటలు లోకమునకు విపరీత కృత్యములుగా తోచినను భగవంతునికి మాత్రము మురిపెంపు చెయ్వులే యగును ... సారాంశమేమనగా ఒక్కొక్క భక్తుని మనస్తత్వమును బట్టి భక్తితో ప్రేమ కలసి యుండునని, అది ప్రణయముగా మారి శృంగారముగా పర్యవసించుననియు, రత్యాలింగితమైన ఈ భక్తినే వైష్ణవ సంప్రదాయములో 'మధుర భక్తి అనియు నందురు.''16

### 2.6. రసౌచిత్యం :

ఔచిత్య మందైనను అత్యావశ్యక మనడంలో విప్రతి పత్తి ఉండరాదు. సర్వోత్తమ కళా జగత్తయిన సాహిత్యంలో ఔచిత్యానికెంతో ప్రాధాన్యమవసరం. కనుక ఔచితీ సహితమైన కావ్యమే శ్రేష్ఠమైనది.

దేనికేది తగి ఉంటుందో అది ఉచితం. ఉచితభావమే ఔచిత్యమని క్షేమేంద్రుడు వివరించాడు. ఈ ఔచిత్యం పదవాక్య గుణాలంకార రస క్రియాదులందు ఉంటుంది. అనౌచిత్యం కంటే వేరు రసభంగ కారణం లేదని ఆనంద వర్ధనుడు వివరించాడు.

''అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రస స్యోప నిషత్పరా॥''

ఇట్లు ఔచిత్యానికి సంస్కృత లాక్షణికులచేత అధిక ప్రాధాన్యమీబడింది. కనుక కావ్యాలు ఔచిత్యం పాటిస్తేనే సహృదయ హృదయా వర్జకాలై ప్రసిద్ధి, శాశ్వతత్వమూ పొందుతాయి. ఔచితీ సహితమైన కృతులలో రసం సముచిత రీతిని పరిపోషింపబడి ఉంటుంది.

# సూచికలు


1. తైత్తరీ యోపనిషత్తు 2–7–1
2. నాట్యశాస్త్రము పు 92
3. ఆంధ్ర శబ్ద చింతామణి పు 1–1
4. Sanskrit Poetics as a study of Aesthetic. 48.
5. నాట్య శాస్త్రము, అధ్యాయం_6
6. సరస్వతీ కంఠాభరణము
7. పై 5 లోనిదే పు_93
8. దశ రూపకము
9. కావ్యాలంకార సంగ్రహము పు 429_441
10. శివానందలహరి శ్లో 61
11. రామ సుబ్బయ్య, మర్రిబోయిన – బ్రహ్మ జిజ్ఞాస పు–219
12. భాగవతము, సప్తమ స్కంధము
13. సాహిత్య వాల్లభ్యము [ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి పు 453_457]
14. పై, 9లోనిదే పుట – 306
15. పై, 4 లోనిదే పుట 60_61
16. పింగళి లక్ష్మీకాంతము, సాహిత్య శిల్ప సమీక్ష పుటలు 164–165
17. ధ్వన్యాలోకము III–15


)— ० —(

# 3. ఎఱ్ఱన- రస పోషణ సమన్వయం

## 3.0

ఎఱ్ఱన రామాయణ హరి వంశాల తరువాత అరణ్య పర్వ శేష, నృసింహ పురాణాలను రచించినట్లు ఎఱ్ఱన కృతుల పౌర్వా పర్యంలో తెలుసు కొన్నాము. రెండో ప్రకరణంలో రస చర్చను గూర్చిన లాక్షణికుల అభిప్రాయాల్ని సంగ్రహంగా గ్రహించాము. ఎఱ్ఱన కృతులలో నవరసాలు, భక్తి, మధుర భక్తి మొదలైనవి ఎలా పరిపోషింప బడ్డాయో పరిశీలించడం ప్రస్తుత ప్రకరణోద్దేశం. వాస్తవానికి ఈ ప్రకరణం నాయీ రచనకు హృదయ స్థాన మనడం సముచితం. క్రమంగా వాటిని పరిశీలిద్దాము.

ఎఱ్ఱన రామాయణం రచించినా ప్రస్తుతం అలభ్యం గనుక అందులో ఎఱ్ఱన పరిపోషించిన, రస వివరణకు అవకాశం లేదు. కానీ కొన్ని పద్యాలు మాత్రం లభ్యమౌతున్న మాట వాస్తవమే అయినా ఆ పద్యాల్లోని కొన్నింటి పృథక్కరించి రస వివరణ చేయడం అంతగా పొసగదేమోనన్న భావం నాకుంది. రామాయణేతి వృత్తం పూర్ణంగా గ్రహించి దానిలోని అంగాంగి రస భావాలను సంపూర్ణంగా విశ్లేషించడం వల్ల ఎఱ్ఱనకు న్యాయం చేకూర్చినట్లవుతుందని గూడా భావిస్తున్నాను. అందుకే ఈ ప్రకరణంలో హరి వంశం, అరణ్య పర్వ శేషం, నృసింహ పురాణాల్లోని రస పరిప్లుతిని సమన్వయ పూర్వకంగా సమీక్షించడానికి ప్రయత్నిస్తాను.

## 3.1 నవరస సమన్వయం

ఎఱ్ఱన కృతులలోని అంగాంగి రస భావ నిరూపణాత్పూర్వం రెండవ ప్రకరణంలో సమీక్షించిన విధంగా నవరసాలకు ఉదాహరణలు చూపించడం సముచితంగా ఉంటుందని భావిస్తున్నాను. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 3.1.1 శృంగారం :

శృంగారం రస రాజమనీ, ఈ రస రాట్టునకు అధిపతి శ్రీ కృష్ణుడనీ సర్వ విపశ్చిద్వరులకు సువిదితమే. ఈ శృంగారానికి స్థాయి భావం రతి. ఇది రెండు విధాలు. సంభోగ శృంగారం, విప్రలంభ శృంగారం.

**అభిలాష విప్రలంభ శృంగారం :**

రుక్మిణి కృష్ణుని సౌందర్యాన్ని జన శ్రుతి వల్ల విన్నదై పూర్వ రాగాన్ని ప్రకటించిన తీరు అతి మనోహరంగా వర్ణించాడు ఎఱ్ఱన.

''తలపులు సిక్కు బీఱువడి తాల్మిలు పెల్లగిలంగ జూడ్కులా
కుల పడి చూపు పందువులు గోరగ గోర్కుల క్రందు చేష్టితం
బుల దడ బెట్టి భావముల పూపు బయల్పడ వారి నిద్దరన్
బలసి మరుండు తుల్య రస పాకము తీపులు గ్రోల్చె విన్కలిన్.''[1]

''అనిమిషసిద్ధ యక్ష భుజ గాదులు వేచినఁ బువ్వు బోడి నె
వ్వనికిని నెట్లు గై కొనగ వచ్చు మదగ్ర విభూతి యల్పమే
యని తమకించి పేర్చెఁ బ్రభుడంగనయుం బురుషోత్తమాత్తయై
యెనయు తలంపు జూడ కొంక యింతయు దక్కక యొండె వేడుకన్''[2]

''పలుక నెంతయు గ్రుయ్యఁ బాటిన నును జెక్కు లందంద దడిపెడు నశ్రువారి
యింకిన చను దోయి యేకావళీ సూత్ర భూషితం బైనది పొలుపు దక్కి
పాటన యెడలుటఁ బాపట రూపేది కడు మాసినది కచ భరంబు
వేడి యూర్పులతోన వెడలు నో యనుబును ననగ టూగాడెడు నంగవల్లి
తలిరు సెజ్జల చందన సలిల వృష్టి
యబ్జదళ కృత వీజనం బాదిగాగ
సఖులు గావించు శిశిరోపచార విధులు
గొనక నిగిడెడు దాపంబు వనజ ముఖికి''[3]

**విరహ విప్రలంభం**

''కులమున్ శీలము మానమున్ మొదలుగా గొన్నాడు మున్నున్నయ
గ్గలికం బ్రాణము లుం గొనంగఁగడగెం గాకేమి యీ కృష్ణుఁడే
వల నీతం డిటు పోవగా నిజ ధనుర్వ్యాపారముల్ సూప కా
వల రాజింతట నైవ జాలునె మమున్ వామ ప్రతాపోగ్రతన్.''[4]

"వెలుపులు పై కొని వెలుగు పాటుల బొంది చెమటలు పెల్లయి చేష్టలుడిగి
పై వర్ణ్యములు పెంది వడకులు దొడరి యశ్రులు జాతి గద్గదికలు గదలిగి
రోమాంచములు పేర్చి పై మనస్యము లూని ప్రేమంబు నెలకొల్పి కా-- గలరి
తాపంబు లెసగి చింతలు విజృంభించి వంతలు పూరుకొని విముగ్ధతలు బలసి
తనుక రాక గోవిందుని దగిలి చిక్కు వడిన చూపులు దిగువనుపాయమేది
కొలిలి మిన్నక నిలచిరి గోపకాంత లందఱును జిత్ర రూపుల యట్టి కరణి"[5]

— ఇందులో గోపికలకు కృష్ణుని పై గల విరహ వ్యధా భరిత మనస్సులను ఎర్రన సహజ సుందరంగా వర్ణించాడు.

## సంభోగ శృంగారం

"అందఱకు నన్ని రూపులఁ
గంధర్వ క్రీడ యేక కాలనియతి నా
నందమయ సామరస్యం
బొంద నలుపు నోలి నొకత నొక్కత నూడన్"
అదియు నదియు నేటిదియో
మది నెఱుగనిక నని సొగపు మరవని వలపున్
బొదలగ గేవల దర్పో
న్మదలై క్రీడింతురా సమస్తాంగనలున్"
"కరజ క్షుణ్ణకుచ ద్వయీ తటములన్ గాఢాగ్ర దంతక్షతా
ధర బింబంబుల న్యూతనాంగుళి దళ ధ్వస్తాలకాభోగ బ
ర్బర సీమంతములన్ ముకుందరతి ధుర్యశ్రీలు గోపాల సుం
దరులం దొప్పెఁదదీయ దుర్గమ వయో దర్పాను రూపోద్ధతిన్"
"ఒకత సంభోగ చిహ్నంబు లోర్తు చూచి
వేడ్కపడ వప్పడంతికి వేఱ భంగిఁ
జేయునదియు నొక్కతకు వాంఛి తముఁ బెనుపఁ
బెనుచుఁ గుతుక పరంపర ప్రియులకెల్ల."[6]

"ధమ్మిల్ల భరముల దండడఁ దొరఁగిన కుసుమంబులును జీర్ణ కుంతలములు
రాలిన కింజల్కార రచనలు కర్ణచ్యుతములైన కర్ణావతంసములును,
హస్త విస్రస్తంబులైన మృణాల కంకణములు కుచ బంధ గళితలైన
యలఘు మౌక్తిక వల్లరులు నితంబ భ్రష్టమైన యుజ్జ్వల మేఖలావళులును,
మృదుల పల్లవ శయ్యలఁ బద సరోజ
యావ కాంకంబులును లేని యట్టి యెడలు
లేవ యెల్లెడలందు బృందావనమునఁ
గృష్ణ సంసక్త వల్లవీ క్రీడనముల"

"తోరంపు టూరులఁ దొడరి యుద్ధత నితంబములపై నొదవ బ్రాకి నాభు
లప్పళించి సమున్నతాంచిత స్తన భరంబులు గౌగిలించి దోర్మూలములకు
దొడకి భుజంబులతోఁ బెన గాడుచు లీల మోములు కబళించి చెక్కు
లంటి కుంతలము లల్లల్లఁ దెమల్చి నేత్రముల క్రేవలు విముగ్ధములు సేసి,
వ్రేతలకు నోలి నింపులు విస్తరింపఁ
దన్ను పోలెడి కాళింది తరగలందు
గ్రాలె ననుదినమును జలకేళి దగిలి
సజల ఘన మూర్తి గోపాల చక్రవర్తి."[7]

— ఇందులో గోపీ కృష్ణుల సంభోగ శృంగారాన్ని అనౌచిత్య రహితంగా ఎఱ్ఱన వర్ణించడం ప్రశంసనీయం.

విభావానుభావ వ్యభిచారి భావాలు, ఆలంబన ఉద్దీపన విభావాలు గూడిమాడి తన్మూలంగా శృంగార రసం ఉత్పన్నమౌతుంది. ఇంతటి ఔచితీ సహితమైన శృంగార రస పరిపోషణం ఎఱ్ఱనకే సాధ్యమైందంటే అతిశయోక్తి కాదు; అత్యుక్తి అంత కంటే కాదు. స్వభావోక్తి అంటేనే సముచితం.

## శృంగారాభాసం

ఏకత్రైవాను రాగం రసాభాసం. శృంగార రసాభాసానికి అరణ్య పర్వ శేషంలో సైంధవుడు అరణ్యంలో ద్రౌపదిని గాంచి మోహించడం చక్కటి ఉదాహరణ.

"నీల పయోద మండలము నిశ్చల లీల వెలుంగఁ జేయుచుం.... —"

"మగువఁ దగిలిన చూడ్కుల మగుడ దిగువ
నేర్పు సాలక యాతఁడు కందర్ప దర్ప
గో చరాత్ముఁడై .... .... ... .... .... ...."

"లీల యెలర్పఁ గా నబల లేఁ జిగురాకును బోలె నొప్పుకెం
గేలు కదంబ శాఖ తుది గీల్కొనఁ జేసి వసంత విభ్రమో
న్మీలత బాలవల్లి క్రియ మేలగు చూడ్కుల మించి పావక
జ్వాలయ వోలెఁ జిత్తము నిజం బెరియింపఁ దొడంగెఁ జూచితే."[9]

— ఇది పురుషునకు పరస్త్రీ, అదీ మగనాలిపై గలిగిన మోహం.

ఇలాగే ఇంద్ర ప్రేరితలై రంభాద్యప్సరసలు హిరణ్యకశిపు తపోభంగం చేయ యత్నించడానికి గావించిన శృంగార చేష్టలు 2.77—869 పద్యాలలో వర్ణితం. ఇందు హిరణ్యకశిపుడు చలించడు. అందువల్లే రంభాదుల శృంగార చేష్టలు విఫల మయ్యాయి.

### 3.1.2 హాస్యం :

వికృతాకార వాగ్వేష చేష్టల వల్ల ఉత్పన్న మయ్యేదీ, హాస స్థాయికమైనదీ హాస్యమని పూర్వోక్తం. దీనికి చక్కటి ఉదాహరణ భీముడు సైంధవుని అవమానించడం. అరణ్యపర్వ శేషంలో అరణ్యంలో ఏకాంతంగా ఉన్న ద్రౌపదిని కామించి సైంధవుడు కొని పోగా ధర్మజాడు తప్ప తక్కిన భీమార్జున నకుల సహదేవులు వెంబడించి అతనితో యుద్ధం చేసి పరాజితుని గావించి, పారిపోతుండగా భీముడు సైంధవుని పట్టుకొని అవమానిస్తాడు.

''వాడియైన కత్తి వాతి యమ్మునఁగొని
వగతు శిరము చెక్కలెగయ గొఱిగి
నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ
గలయ నైదు కూకటుల నొనర్చె.''[10]

— ఇందలి సైంధవుని వికృతా కారం వల్ల హాస్యరసం సముత్పన్నమై ఆనందాతిశాయి అవుతుంది.

బాలకృష్ణుని లీలా విశేషములతో ఎంతో హాస్యం హరి వంశంలో మనం చూడ గలం.

బలరామ కృష్ణులు మధురాపుర ప్రవేశ సమయంలో సుగంధ ద్రవ్యాదుల్ని కొని పోతున్న కుబ్జ ఆకారం వల్ల సైతం హాస్యం ఉత్పన్నమవుతుంది.

"ఎఱ్ఱాప్రెగడ శిశుపాలుని వర్ణనా సందర్భ మందొక సమున్నతమైన హాస్యమును ప్రవేశ పెట్టినాడు. రుక్మిణిని పెండ్లి యాడుదునని వివాహ మంగళోచితాలంకారములతోఁ గై సేసి శిశుపాలుఁ డుత్సాహమున నుండ రుక్మిణీ హరణమైన వార్త వచ్చినది. అప్పుడు—

"అనువెర శిశుపాలుం డొక
ఘన పరిఘము కేల దాల్చి గ్రక్కున జవనా శ్వుని యెదుర్గ నిల్చి"
"పెండ్లి యాడుదునని కడుఁ బేర్మి తోడ
నిట్లు గై సేసి తుదినింత యెడరు నొంది
యున్న నాక కా కీ యొచ్చ మొఱుత కేమి
గారణము నిల్వఁ డెవ్వారుఁ గదలవలదు" (హరి వంశము : ఉ.భా–3.99)

అని రచించాడు.

"ఈ పద్యము నందు శిశుపాలుని శౌర్యము, అవమానమును సహింపలేని అభిమానము, ఒక విధమైన ఉత్సాహము అన్నియును గలసి వీర రసాంగములై నవి. కాని యా వీర రస విస్ఫురణ మంతయు శిశుపాలుని చేష్టల వలనను మాటల వలనను అవనయితవ బడినది. చివర పద్యమందు వీరమాభాసమై హాస్యమే స్థిరపడినది. పాపము, శిశుపాలుఁడు వివాహమునకై మంగళాకారములగై సేసికొని సమవయస్కులగు రాజ కుమారులతో సరస సల్లాపములాడు చుండినవాఁడు. అట్టి సందర్భమునందు కృష్ణుఁడు రుక్మిణి నపహరించినట్లు వార్త వచ్చినది. ఆ సమయమునకుఁ దగినటు లందఱు యుద్ధ సన్నద్ధులగు చుండగా పెండ్లి కుమారుఁడు పరిఘమొక్క దానిని బట్టుకొని బయలు దేరుటను నదియే హాస్యమునకు తావు నిచ్చుచున్నది. అంతటితో నాఁగక శిశుపాలుఁడు తన స్థితిని గూర్చి తెల్లము గావించుచు "పెండ్లి యాడుదునని కడుఁ బేర్మి తోడ నిట్లు గై సేసి" అని పలికినాడు. ఇచ్చట శిశుపాలుని యాకార విశేషము మఱియు నంతకన్న నధికముగా నతని వాక్యములు హాస్యమున కంగములై నవి.

"పూర్వశౌర్య పతివృత్తుఁడైన శ్రీ కృష్ణుఁడు కన్య నపహరించి రధము పై నిడుకొని వెడలఁగా సేనా సన్నాహము లేని పెండ్లి కుమారుఁడు తోటి రాజుల సాహా

య్యమును గూడ వలదని యొక్క పరిఘ మాత్రమే చేతగొని భీరములు బలుకు చుండుట యెంతయో హాస్యాస్పదమై యెంతటి గంభీర స్వభావులనైన మందస్మితుల గావించుచున్నది."11

"హాస్య రస సూచకములైన వర్ణనలు పూర్వ కవులలో అరుదుగా కనిపించును. హిరణ్యకశిపుని ఉద్ధత చేష్టలను వర్ణించుచు ఎఱ్ఱన కవి హాస్య రస ప్రధానముగా అభినయించినాడు.

> ''తపములఁ గ్రుస్సిన తపసులఁ బట్టి తెప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
> మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ గట్టి క్కొ నీ యలఁగవణ మెత్తు
> భుజగేశ్వరుల శిరంబున నున్నమణులూడ్చి కొమరార వత్రువగుండు లెత్తుఁ
> జెలఁగి గంధర్వుల చేతి వీణెలు పిశాచులకిచ్చి పాడించి చూచి నవ్వు''12
>
> (నృ.పు-2-127)

ఇలాగా ఎర్రన తన కవితలో హాస్య రస పోషణ గావించి తన హాస్యస్ఫూర్తి మూర్తిని మనముందు ప్రత్యక్షీకరించి ఆనందానందానికి ఆస్పదమైన తీరును విస్పష్టం చేశాడు.

### 3.1.4 కరుణం :

'ఏకో రసః కరుణ ఏవ' అని భవభూతిచే ప్రస్తుతింపబడి ప్రతిపాదించబడిన కరుణ రసం సర్వ సహృదయ హృదయాలకు సమాదరణీయమైన రసం. దీనికి స్థాయి శోకం.

రజి చేత పరాజితుడైన ఇంద్రుని దుస్థితి కరుణ రస నిర్భరంగా వర్ణించాడు ఎర్రన.

> ''సిరి బాసి వాసవుఁడు దన
> గురు గానఁగ నరిగి యతని గురుతర చరణాం
> బురుహముల కెరగి యపరి
> స్ఫురితములగు గద్గదోక్తముల నిట్లనియెన్''
> ''రజిచే గద్దియ గోలు వోయి విభుతా భ్రష్టుండనై క్రమ్మఱన్
> రజి పుత్రావళి యాక్రమంబున ననర్థంబుల్ పొంది బైకొనన్
> నిజమై యెందును నిల్వ నేరక విపన్నిర్మూలితం దూలెదన్
> సుజన శ్రేష్ఠ యొకింత నాదెస కృపం జూడం దగున్ జూడవే''13

ఇందులో పద భ్రష్టుడై దుఃఖితుడైన ఇంద్రుని శోకం స్థాయి. తన్మూలంగా కరుణ రసముత్పన్నమై అంతటి వాడు ఇంతయ్యేనా అని జాలి కలుగుతుంది.

ఇలాగే హిరణ్యకశిపుడు ఘోర తపమాచరించి వరాలు పొంది ఇంద్ర లోకం కైవసం చేసుకొన్నప్పుడు దేవతలు దైన్యంతో విష్ణువును మొర బెట్టుకొనడంలో కరుణ రసం చిప్పిలుతూంది.

"( త నొంది దేవతలు బామరి దుగ్ధ పయోధి మధ్యవి
స్ప భుజంగ శయ్యనము భావ సమూహిత సుప్తి నొప్పుశి
విధాయి విష్ణు జగదీశ్వరు నార్త శరణ్యు సత్కృపా
దృష్టి సమగ్రుఁ జేరిరి ప్రదీప్త పరాక్రమ చక్ర శోభితున్"

"చేరి దైన్యంబుతోఁ దమ చెడ్డ చేటు
లన్నియును విన్నవించి లోకాధినాథ
యజ్ఞుఁడు మొదలగు సర్వ భూతావళికిని
దిక్క మెవ్వరు శరణంబు నీవు దక్క"

"దితి సూనుఁడునిమి మఱియును
దితిజ కులము పీఁచ మడఁచుతేకువ మదిఁబూ
నిత యేని మమ్ము నేలుట
సతతమగు నమ్మయికిఁ గరుణ సరు కొలుపఁగదే"14

భూదేవి శోకంలో కరుణరసం :

"అ యెడను భూమి దేవి యాత్మీయమైన
మూర్తి ధరియించి యెంతయు నార్తి దోప
నచటికేతెంచె నిఖిల సురాళి చూడ్కి
గములు నంతంతఁదన మీదఁ గడలు కొనఁగ"

"అక్కాంత డప్పిగని కడు
వెక్కసపడి పలుకు సభ్యవితతుల పలుకుల్
దిక్కూ లంకష నినదం
బక్కజమై యెసగె వెన్నుఁడా క ంపన్"15

దీని కంటె అక్క అయిన దే దేవి సుతులను సంహరించి కంసుడు శోకించ డంలోను కరుణ రసముంది.

"ఇక్కడఁ గంసుండును దేవకీదేవికిఁ గృతాంజలియై యిట్లనియె"[16]

"ఏనిటు ప్రాణ రక్షకయి యెంతయుఁ బాపము సేసి గర్భసం

తాన విఘాతి నై నిను సుదంచిత శోక పయోధి ముంచితిం

బూనిన మత్కృతంబఖిలమున్ వృథయయ్యె విధాత చెయ్వులె

వ్వానికి మాన్పంగా నకట వచ్చునె మానుష తుచ్ఛ యత్నతన్"

"కాన నింతయుఁదలపోసి మానుమింక

నఖిల దుఃఖ చింతామయం బైన కలఁక

యేను గాలు గేలును బట్టి యిదె వినీతి

వేడికొనియెదఁ బరమ పవిత్ర చరిత"

"అనిన నద్దేవి యశ్రు పూర్ణనయయై తండ్రిః యిట్టి

శోకంబు నాకనుభవింపను మద్గర్భంబులకు

నిట్టి పోకలంబోవను మున్నకడకట్టిన తెఱంగు

నీవేమి సేయుదవి యుచితంబు గాఁబలికె"[17]

ఇంతేగాక కృష్ణునితో అక్రూరుడు దేవకీదేవి కరుణ రస పూరిత స్థితిని దెల్పుటం గమనించ దగ్గది.

"ఉడుగక కన్ను నీరుఁగడు నొప్పుతీ చాయలు చెడ్డ కన్నులున్

వెడఁ గురువడ్డ మోము బటువేదనఁ గుందిన యంతరంగమున్

బడుగయి యున్న మేనునయి కామివి తప్ప విహీన ధేనువుం

దడపఱుపంగవచ్చు దనదై న్యము కావ్యత [illegible] గనుంగొనన్"[18]

ఇంతై నా ప్రేపల్లెలో దినదిన ప్రవర్ధమానమవుతున్న శ్రీకృష్ణుని పలువిధాలుగా హింసించి వధించ యత్నించి చివరికి కంసుడు శ్రీ కృష్ణునిచేత సంహరించబడినప్పుడతని సతులు శోకాబ్ధిలో మునిగిన తీరును కరుణరస భరితంగా హృదయ విదారకంగా ఎర్రన అభివర్ణించడం అత్యంత ప్రశంసనీయమైన అంశం.

'దితిసుతాంతకు చేఁజిక్కి దిక్కులేని

పీనుగై రంగ వాటంబు పెద్ద బయలఁ

బడిన యక్కంసు కడకుఁదద్భార్యలెల్ల

నరుగుదెంచిరి వెసనంతిపురము వెడలి'[19]

"అప్పుడు—

'కరతాడనములఁ జన్నవలపై లత్తుక చట్టలు చఱచిన చాడ్పుదోఁపఁ
దెగిరాలు హారమౌక్తికములు నశ్రు బిందువు లేర్పఱుపరాకఁ దొందడింప
నెందెడు వాతెఱనెసఁగు తాంబూలరక్తిమ శోకవహ్నిఁగ్రక్కెడు తెఱఁగుగఁ
జూలెడు పయ్యెద దుఃఖాంబునిధిలోని కడలు చందంబునఁగడలు కొనఁగ

వీడి వెన్నుల వ్రేలెడి వేణులోలి
బెలసి కాలాహినిభము లై సొలపుఁజూప
బొదువు మూర్ఛల డెందంబు దిగులు కొలుప
వలత కొలదికి మిగిలె నయ్యంగనలకు"
'అందఱు పతి పై బడి పెను
గందగ నఖిలాంగకములు గనుఁ గొని గౌగి
ళ్ళం దొడరగ నిట్లని యా
క్రందన మొనరించి రధిక కరుణధ్వనులన్'[20]

ఇది భారతం స్త్రీపర్వంలో అసూర్యంపశ్యలైన కౌరవ స్త్రీలు అంతఃపురంవెడలి పొలికలనిలో పీనుగు పెంటలై పడిఉన్న తమ తమ భర్తల, తండ్రుల, పుత్రుల,బాంధవుల గూర్చి విలపించిన తీరును గుర్తుకు తెచ్చి ఆశోకం వలన అత్యంత కరుణ రసోత్పత్తిని చేయగలిగింది. ఎంత దుర్మార్గుడైనా తమకు పతి దేవుడు. అలాంటి వైధవ్యం మహా దారుణమని స్పష్టమవుతుంది. కంసుడు అంత దుష్టుడైనా తల్లిసైతం ఆతని మరణానికి విలపిస్తుంది. అది మాతృ హృదయం! తల్లి కడుపుకోతను గూర్చి ఎవరు చెప్పగలరు? ఆ తల్లి—

'కనిపైబడి కోడండ్రురు
దన చుట్టును బొదివి యేడ్వ దద్దయు శోకం
బున నంకతలంబునఁబు
త్రుని తలఁ గదియించి యెలుగు దొట్రువడంగన్'[21]

విలపించి పుత్రుని మరణాన్ని గూర్చి భర్త ఉగ్రసేనునితో—

"నీ పుత్రుని జూచితే ధర
ణీ పాలక! వజ్ర పాతవిహతాద్రి క్రియన్

రూపటి వీర శయన సం
ప్రాపితుఁడై నాఁడు కృష్ణ బాహుస్ఫూర్తిన్''22

అని చెప్పి శోకిస్తుంది. ఇందులో చక్కటి కరుణ రసం పరిపోషింపబడింది. రస పోషణ ఇంత మనోహరంగా చేయగల స్రష్ట ఎర్రన. అతడు స్రష్టకనుకనే ఇంత మనోహరంగా కరుణ రసాన్ని ఔచిత్యంతో పోషించాడు.

దేవసేనను కేశియను దానవుడు అపహరించుకొని గగన మార్గాన వెళ్ళుతుండగా దేవసేన కరుణ రస భరితంగా శోకిస్తుంది.

'ఒక్క దనుజాధముండు మొత్తోయనంగ
నన్నుఁ జెఱగొని పోయెడు నన్నలార
యెవ్వరిట విడిపింపరే యింత వట్టు
పుణ్యమునఁ బోవరయ్య కారుణ్యబుద్ధి'23

పాండవులరణ్యావాసంలో పడ్డ ఇడుములకు తానేకారణమని ధృతరాష్ట్రుడు దుఃఖించడంలో కరుణ రస ముత్పన్న మవుతుంది—

నా చేసిన కీడునఁగడు
నీచుండగు నా తనూజు సేరమి నిమ్మై
నో చెల్ల పార్థులకుఁబు
ణ్యాచారుల కెందులేని యాపద వచ్చెన్'24

కరుణ రస పరి పోషణకు, తద్వారా ఎర్రన ఔచితీ నిర్భరమైన రచనా రీతికి ఎన్నేని ఉదాహరణలు ఇవ్వవచ్చును. ఇవి కేవలం కొన్ని మచ్చుతునకలు మాత్రమే. ఇలాగే ఎర్రన కృతులలో కరుణ రస భరితమైన రచన, కరుణ రస సృష్టి కనిపిస్తూనే ఉంటుంది.

కరుణ రసముప్పతిల్లే మరో చక్కటి సన్నివేశం స్మరించక తప్పదు. కాళియుని చేత చుట్టబడిన బాలకృష్ణుని గూర్చి తల్లి యశోద శోకం తల్లుల హృదయాలనే గాదు, అందరూ తల్లులై తల్లడిల్లునట్లు చేయగలదు.

'నా మీదం గృపయెప్డుఁజాలఁగలవన్నా యేను శోకాగ్నియం
దీ మూడ్కింబడగా నుపేక్ష దగునే యీవిక్కు చిర్నవ్వతో

నీ మోమింపుగఁ జూపవే తెలుపవే నేత్రాబ్జముల్పొల్కవే
యామోదంబుగఁబుత్ర తల్లులకు నిట్లెత్యార్తి గావింతురే'
'కడ్డిది విషకంట కాటవిఁ
గడికండలు చేసి నీఱు గావించితి నీ
పొడపాము నీకు నేటిది,
కొడుకా నీ కులము వంత గూఱుటుడుపవే'[25]

ఒక్కగానొక్క కుమారుడు: వాడు మహామహిమాన్వితుడు. అయినా తల్లి హృదయం ఎలా తపిస్తుందో! ఎఱ్ఱన కరుణ రస పరిపోషణకు పై ఉదాహరణలన్నీ ఉపకరిస్తాయి.

## 3.1.4 రౌద్రం :

రౌద్ర రసానికి క్రోధం స్థాయి. రౌద్ర రసాన్ని సైతం సముచిత రీతిని ఎఱ్ఱన పోషించడం గమనించగలం. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని నాగపాశ బద్ధుని చేసి సముద్రంలో తోయవలసిందని ఆజ్ఞాపించిన సందర్భం.

"అనిశంగల్పాంత వాత్యాహత విబుధనగోగ్రాకృతిన్ హేమసింహా
సన భాగోత్తాన వేగోజ్జ్వలుడు దశన విస్పష్ట దంష్ట్రాధరోష్ఠుం
డును రోషోత్కంప తీవ్రుండును ఘనరభసాటోప దీప్తుండునై య
ద్దనుజుం డా పుణ్యు వక్షఃస్థలముఁగడువడిందాఁచె నిశ్శృంఖలాంఘ్రిన్"

ఇక్కడ రౌద్ర రసోచితమైన శబ్దాల్ని ప్రయోగిస్తూ మహాస్రగ్ధర వృత్తాన్ని స్వీకరించడంలో ఎఱ్ఱన ప్రత్యేకత వ్యక్తమవుతున్నది. హిరణ్యకశిపుడు ఉగ్రాకృతితో, వేగోజ్జ్వలుడై, దశన విస్పష్ట దంష్ట్రాధరోష్ఠుండై, రోషోత్కంప తీవ్రుడై, ఘనరభసాటోపదీప్తుడై ఉన్నాడని వర్ణించడంలో రౌద్రరస పోషణ ఇక్కడ అత్యంత సమర్థవంతంగా జరిగిందని చెప్పవచ్చు.

"ఇవ్విధంబునందాఁచి",[26]
"కోలుమసంగి చే చఱచి కొనుచు మ్రోగఁబునఁ గన్ను గోనలన్
రాలగ నిప్పు లీ త్రిభువనంబుల నొక్కటమ్రింగఁ జూచెనో
కాలుడొ యీతఁడింతటికిఁ గాలము నిండెనో కాక యంచుభూ
తాలి దలంక నిల్చి తనుజాశిష్ఠు దిట్లని పల్కె బింట్లతోన్"

"ఓయి విప్రజిత్తః యోయి రాహువః యోయి
బలుఁడః రండు వీనిఁ బట్టి పెట్టి
చటుల నాగ పాశసంచయంబులఁ గట్టి
యబ్ధినడుమఁ ద్రొక్కుఁడదటఁగంగ"

"మనఁదెన గీడు లేదు పలుమాఱులను జప్పెడి నోరి శత్రుకీ
ర్తి నె మిటుసేయగా దగదురా యని యమ్మెయిఁ జాటి చెప్పినన్
వినఁడు దురాత్ములైన యవివేకులకున్ బ్రతికార మెమ్మెయిన్
మునుగలదే వెసం జిదియ మోదుట చంపుట దక్క నెక్కుడన్"[27]

ఇందు క్రోధం స్థాయిగా రౌద్ర రసం హిరణ్య కశిపుని మూలంగా సువ్యక్తం
ఇలాగే నృసింహావతారంలో రౌద్ర రసం పరిపోషితం.

"కోఱలు గీటుచు న్నయన కోణములం దహన స్ఫులింగముల్
గాఱగఁ గర్జముల్ బిగియగా ఘన కేసరముల్ విదుర్చుచున్
మీఱినయుబ్బునన్ బొదలి మీదికి మూరెడు పేర్చి కింకదై
వాఱగఁ బట్టె బిట్టు దితిపట్టి నృసింహుఁడసహ్య తీవ్రతన్"

"పటుమృగాధిపుఁ జూడఁజాటి పదం బేచె వడకు బంధుర మదావళము భంగి
నుద్దామ విహగేంద్రు నురువడి కగపడి యదలుచు నొఱలు మహాహిపోల్కి
మెదలి క్రోల్పులి బిట్టు పొదవినఁబోలేక బెగడొందు సారంగ విభుని పోల్కిఁ
గతగి సాగర చరగ్రాహంబు నొడుపున జడిసి చిక్కిన తీర వృషము లీల

రౌద్రవేగ రోషరభస నిరంతర
స్ఫూర్తియగు నృసింహమూర్తి తప్పు
దగ్గమై సురారి యపగత తేజుడై
యదగి యుండె మెదల మెదుక లేక"[28]

ఇది నృసింహ పురాణంలోని రౌద్రస్ఫూర్తి. ఇలాగే మరికొన్ని ఉదాహరణలు.
శలుడు వామదేవుని సంహరింపుమని తన పార్శ్వ జనముల కాజ్ఞాపించిన సందర్భం.
"అంతయుం జూచి వారు దేవుండు ఘనరోష భీషణ ప్రహాస దుర్నిరీక్షణ రూక్షము
ఖుండగుటయు"

"కడు గ్రొవ్వి తేకువ సెడియె నీ పాఱుండు
వీక మైనిప్పుడు వీనితొమ్మి
వ్రయ్యంగఁ జేసెదఁ జయ్యన విషదగ్ధ
సాయకమును శరాసనము దెమ్ము నావుడు..."

"కోపాటోపావేశ మానమానస నిగ్రహుండగుచుఁ దన దురాగ్రహంబు
విడువక తన సమీప వర్తులం జూచి"29

"వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీ విప్రున్ దురాలాపు దు
ర్జనునిం దున్మెద నస్మదీయ సుమహచ్చా పోగ్ర నిర్ముక్త బా
ణ నిపాత చ్ఛి దురాంగ రక్త జలశోణ క్షోణిసంసిక్తగాఁ
గనుఁడీ యీదురితాత్ము నంచు నతి శీఘ్ర ప్రాప్త కోదండుఁడై"30

ఇలా ఎంతో ఉచితంగా రౌద్రరస పోషణలో ఎఱ్ఱన ప్రతిభ స్పష్టమౌతుంది. హరి వంశములో నృసింహావతార ఘట్టంలోనిది.

"స్కంధ విధూ న నస్ఖలిత సటా సమీరమున ఖేచర విమానములుదూల
దంష్ట్రా సముద్ధత దహనచ్ఛటానిపాతంబు దిగ్వదనంబు లెరియఁ
గ్రోధ తరంగిత ఘోర నిశ్వాసవేగమునఁ బాథోధి పూరములు గలఁగ
దర్ప సంభృత మహోదగ్రహుంకార ఘోషమున బ్రహ్మాండోదరములు వగులఁ

గలుష నేత్రకనీనికాకపిలరోచు
లరుణ శశభృ న్మరీచుల నాక్రమింప
నమరు నరసింహమూర్తి యేపారదాల్చి
విభుఁడు దైతేయు నెదుర నావిర్భవించె"

"అట్టి దారుణ రూపంబు నాలోకించి యాలోక కంటకుండు కంటకితాంగుఁ
డగుచు భయ విస్మయ రసంబుల మునింగి"31

ఇలాగే ఇంద్రాది దేవతలతో కాలనేమి అనే రాక్షసుడు యుద్ధం చేయ సమకట్టి నప్పటి రౌద్ర రస స్ఫూర్తి గమనించ దగ్గది.

"రౌద్రరప స్వభావోద్రేక మంతయు సాకారమై తనరారె ననఁగ
వీర గుణోల్లాస విభవంబు సర్వంబు నవయవ ప్రౌఢిఁ గ్రొవ్వలరెననఁగ

గర్వ సర్వస్వ రేఖాతత్వమఖిలంబు విగ్రహ వ్యాప్తి గావించెననఁగ
దర్పసం భార దుర్దమ విశేషం బెల్ల దను వికాసంబు గైకొనియె ననఁగ

ప్రళయ కాలదహనుప్రతిబింబమనఁగ గృ
తాంత రోషవికృతి కాత్మయనఁగ
నెగడ వాడు కాలనేమి నానౌక దైత్యుఁ
డపరి భావ్యబల నిరస్త రిపుఁడు."

"శత భుజుఁడు శత శిరస్కుఁడు
శత శిఖరో దగ్ర శైల సదృశుఁడు దీప్తా
యత పింగశ్మ శ్రుకచా
న్విత నీల శరీరుదుగ్ర విచక్షణుఁడెందున్"[32]

రౌద్ర రసం మనోహరంగా చిత్రితం. ఇలాగే బాలకృష్ణుని పూతన చంపనెంచి నప్పటి సందర్భంలో పూతన క్రోధం మూలాన రౌద్రరస సృష్టిచేసిన ఎర్రన ప్రతిభ ప్రశంసనీయం.

"పండ్లులు గొఱుకుచుఁ బదరి హుమ్మని మిడి గ్రుడ్డుల నిప్పులు గుమ్మరిలఁగ
నదరెడు కటములు నాకుంచితములగు బొమలును నుదిటిపైఁ బొడముచెమట
మెఱుగు కోఱలుఁబేర్చి యెఱమంటలందంద జల్లెడు బహుళ నిశ్వాసములును
నాగ్రహంబునఁ దొరినాకంపితములగు కరములునై భయంకరముగాగ"[33]

విషస్తన మిచ్చినదట పూతన. ఆకలిగొన్నవాడు బోలె బాలుడైన కృష్ణుడు పూతన స్తన్యంతోపాటు రక్తాన్నిత్రావి మహాఘోరంగా సంహరించాడు. పైపద్యంలోని క్రోధం వల్ల రౌద్ర రసం సమున్నతమై సహృదయాలను రంజింప జేస్తుంది. ఇది ఎర్రన ప్రతిభకు నికషోపలం.

### 3.1.5. వీరం :

వీర రసాన్ని అత్యున్నతంగా ఎర్రన వర్ణించి ఉండడం గమనించవచ్చు. హరి వంశమంతా వీర రసోదంచితంగా సాగింది. ఎర్రన సాహిత్యమంతటా ఇదిసాక్షాత్కరిస్తుంది. పైగా ఇది పలురకాలుగా ఉంటుంది. ఉత్సాహం వీరరసానికిస్థాయి .కొన్ని ఉదాహరణలు :

యుద్ధ వీరం :

శ్రీ కృష్ణుడు చాణూరునితో మల్లయుద్ధసమయంలో యుద్ధవీరోచితంగా పల్కిన పల్కులు :

"నిను నిఖిలార్థ కారియుగ నెమ్మది నమ్మిన వాఁడు కంసుఁడె
య్యె నువున(గుస్సి పోక బలమంతయుఁజూవుదుగాక రిత్త ర
జ్జనఁ బనిదీఱునే వెడగ చండితనంబున నీవు గన్న యీ
యనుపమ కీర్తి కింతట సమాప్తి యొనర్పఁగఁ జూప వచ్చితిన్"34

"కడుఁబెద్ద క్రొవ్విన కాళియుతలలెల్లఁ జిదియంగఁ ద్రొక్కిన పదతలములు
దుష్టాత్ముఁడైన యరిష్టుని మెడవట్టి పారిపోవ విఱిచిన భుజయుగంబుఁ
విసితాశియగు కేశి(బ్రేవులు వెడలంగఁగడిమి మై దిగిచినఖరనఖరము
ల విపీతిఁ జెనకిన కువలయా పీడంబు మోరఁ బగిల్చిన ముష్టి బలువు,

నెఱుగ వెఱిగిన నిటులేల యేపు మిగిలి
యెదురు నడతెంతువే నీవు వీక్షణంబ
విఱిచి (వ్రోవు వెట్టెదఁ జూచి వెఱియు వెఱఁగు
పాటు గదిరి నీయేలిక ఁబమసి పడఁగ"
"పగఱ ఫాటించి వీరి ఱంపగఁ దఱంచి
యేను గదసితి మెచ్చింతు విటుఱన్న
యిందఱును జూడుఁ దూఱక ఱట్టు నట్టు
నవక లావును విక్రమ వ్యాప్తి వెరవు"

"కరూశ దేశంబునం బ్రభవించి చాణూరుండన (బసిద్ధుండైన వీనిచేత పెక్కండ్రు మల్లులు సిక్కిరి; వీనిం బడవైచి యసాధారణంబగు యశంబుఁ బొందెద ననియె"35 అని తన ఉత్సాహ శక్తిని పరాక్రమాన్ని శౌర్యాన్ని ప్రకటించి చాణూరుని యుద్ధంలో సంహరించడంలో వీర రస ముప్పతిల్లి సహృదయావర్జక మవుతుంది. కృష్ణుడు కంసుని వధించిన తీరు మరింత మనోహరంగా వర్ణితం.

"కరి పతియున్న శైలకటకంబున్నకుం బటు వేగ చండమై
హరిపతి దాటునట్లు హరి యారిపుడున్న యుదగ్ర సౌధమం

దిర వలభీతటంబునకుఁ దీవ్రతంసుప్పరవీధి దాటిని
ర్భర పవన ప్రకంప విచరన్నవనీలవలాహకాకృతిన్"

"రంగ మధ్యంబు నందుండి రాజుదెసకు
నుఱుకు కృష్ణు వేగ స్ఫూర్తి గొక్కరుండు
గానలేకున్కిఁ గనుమాయ కరణియయ్యెః
గంసు ముందర నిలుచుండ గనిరి మరల" 36

"మణులు రాలగఁ జారు మకుటంబు బడదన్ని వడి పెంద్రుకలు వట్టి వ్రాలఁదిగిచి
నడుతలయందంద పిడికిట మెదడును గలగంగ బొడిచి మోకాల నురము
దాకింప నొక్కచేతయుఁ జేయలేక నిశ్చేష్టుఁడై రోజు నిర్జీవుఁ బెలువ
హారముల్ ద్రెవ్వఁగర్ణావతంసము లూడ నత్తఱి నుత్తరీయంబు వీడ
నోరముక్కున జెవులను ఘోర రుధిర
మొలుక గ్రుడ్డులు వెలుపలి కుఱుక మేడ
డిగ్గఁ ద్రోచి తోడన డిగ్గి స్రగ్గఁగేల
గ్రుమ్మె మనుజు వోవంగ సక్రోధలీల"
"గొదగొని సారంగంబుం
బొదివిన సింగంబు పగిది భూరి బలము పెం
పొదవంగఁ జేరి చెండా
డి దురాలోక క్రియా పటిష్ఠత మెఱపెన్''37

ఈ విధంగా కృష్ణుడు కంసుని సంహరించడంలో శ్రీకృష్ణునివీరం ప్రస్ఫుటమై సర్వలోక దర్శనీయమై మార్గ దర్శకమై దుష్టశిక్షణ జరిగి తమ్మూలంగా ఎర్రన వీరరస పోషణం సుస్పష్టమవుతుంది. ఇలాగా ఇంకా ఎన్నెన్నో హరివంశం నుంచి ఉదాహరణ లివ్వవచ్చు.

## దాన వీరం :

కంస మరణానంతరం, కంసుని తండ్రి ఉగ్రసేనుడు కంసుని ఉత్తర క్రియలకై అనుమతినిమ్మని కృష్ణుని వేడుకొంటాడు. ఆసందర్భంలో కృష్ణుడు కంస రాజ్యాన్ని—కాదు—కంసుడాక్రమించిన ఉగ్రసేనుని రాజ్యాన్ని, కంసుని సంహరించి కృష్ణుడే

అధిపతి అయి ఉగ్రసేనునకు దానం చేస్తాడు. ఇందులో దాన వీరం అత్యంత మనోజ్ఞమై ఒప్పుతుంది. రాజ్యం వీర భోజ్యమే అయినా, ఉగ్రసేనునకు దానమివ్వడంలో ఈ దాన వీరం స్పష్టం. పైగా తన కర్తవ్యం రాజ్యాక్రమణం కాదు. అధిపత్యం అంతకంటేకాదు. దుష్ట శిక్షణ; శిష్టరక్షణ; అందుకే రాజ్య దానం: దాన వీరం.

"రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నాసయుఁజొరదు నాయాత్మ, గంసుఁ
దునుముటయును నర్థ దోహలంబునగాదు, వంశ పాంసనుడును వసుధ కెల్ల
గంటకుండును గాన గ్రక్కున నాతని నిట్లు సేసితి లోకహితము గోరి,
యెవ్వారలకు లేని యెసకంపుఁగీర్తి శాశ్వతమయ్యె నింతయు చాలు నాకు

నింక నెప్పటి యట్టుల యేను బోయి
యాల కదుపులలోన గోపాల కోటి
గూడి యాడుచునట వన్యకుంజరంబు
రీతిఁ గోరినట్టుల విహరించు వాఁడ"[38]

"నీ సొమ్మై పెనుపొందు రాజ్యము దగన్నీకిక నీచాత్ముడై
నీ సూనుండెడ నాక్రమించి కొనియెన్నిర్వ్యాజ భంగిం దుదిన్
దోసంబేమియు లేక యంతయును నిన్నుం జేర్చెఁ గైక్కొమ్ము నా
యాస ప్రక్రియ నిష్ట పొందు మభిషేకానంద కల్యాణమున్"

"ఏను గెలిచిన సిరి నీకు నిచ్చుచున్న
వాఁడ నామీఁద బ్రియమును వత్సలతయుఁ
గలిగెనేని ద్రోవక చేయవలయునాదు
ప్రార్థనంబు పర్వాన్వయ ప్రభుఁడవీవు"

" ...అతని ననఘుండాక్షణమ సర్వయదు మధ్యమునన్"
"భద్రాసనంబున నునిచి సముచితంబుగ నభిషేకించె"[39]

ఇందు దానవీరం సర్వలక్షణ లక్షణోపేతమై ఒప్పుతుంది.

## దయా వీరం :

పాండవులు అరణ్యవాస క్లేశ భారమగ్నులై జీవిస్తూ ఉంటగా ఘోషయాత్రపేరు చెప్పి, పాండవుల నవమానించబోయి తానే గంధర్వులచే నవమానితుడవుతాడు దుర్యో.

ధనుడు. ఆ సమయంలో ధర్మజునాజ్ఞతో తమ్ములు విడిపించి రక్షిస్తారు. ధర్మరాజు వద్దకు కొనిరాగా అతనిని వదలిపెట్టి పొమ్మంటాడు ధర్మరాజు—

"ఎన్నడునిట్టి సాహసములింక నొనర్పకుమయ్య; దుర్జనం
డన్నన సాహస క్రియలందుఁ గడంగి నశించు గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గై కొని యిమ్ముల బొమ్ము పీటికిన్
సన్నుత దీని కొండొక విషాదముఁబొందకుమీ మనంబునన్"
"అని బుద్ధిసెప్పి వీడ్కొలుప నతండును దీనాననుండగుచుం జనియె"[40]

ఇలాగే ద్రౌపది అరణ్యంలో ఏకాంతంగా ఉండగా సైంధవుడు అపహరించు కొనిపోగా భీమార్జున నకుల సహదేవులు పట్టి అవమానించి బంధించి ద్రౌపదీ ధర్మజుల ముందు సైంధవునుంచగా అవమానిత అయిన ద్రౌపది సహితం క్షమాగుణంతో "పాంచాలియు జయద్రథుంజూచి నవ్వుచు నిప్పాపాత్ముండు భవదీయ దాసుండయ్యెంగావున వీనిం బో విడువుడని విడిపించె"[41] అట్లే ధర్మరాజు దయాగుణసముపేతుడై —

'ఎట్టి కష్టుఁడైన నిట్టి పాపము సేయ
నెత్తి కొనునె యోరి నీవుదక్క?
నరుగు మింకనేమి యందుము విన్ము నిం
ద్రియ విలోలు నల్పు ధృతివిహీను'[42]

'ఇంకనెవ్వారికి నిట్టికొఱగాములు సేయక
బుద్ధిమంతుండవై యుండుమనిన నతండు
లజ్జావనత వదనుండగుచు నచ్చోటు వాపె'[43] సైంధవుడు వెళ్ళిపోయాడు.

ఇది దయావీరం. ఇంతేగాదు క్షమావీరం అన్నా తప్పులేదు. ధర్మరాజు క్షమించి వదలి పెట్టడంలో ఆశ్చర్యంలేదు. అవమానిత అయిన ద్రౌపది సహితం దయా, క్షమా గుణాలతో సమ్మిశ్రమైన ఉన్నతోన్నత సద్గుణోపేతఅయి వదలి పెట్టుమనడం విశేషం. ఆ పాత్ర ఉత్తమ శీలానికి నికషోపలం.

## ధర్మ వీరం :

ధర్మవీరం అరణ్య పర్వ శేషంలోని సావిత్ర్యుపాఖ్యానంలో నిర్వహించబడింది. దీనిని సమగ్రంగా పరిశీలించిన శ్రీ దేవరకొండ వీరయ్యగారి వాక్యాలనే యథాతథంగా గ్రహించడం సముచితమని భావిస్తున్నాను.

"సావిత్ర్యు పాఖ్యానము ధర్మ వీర రస ప్రధానము. సావిత్రి విష్ఠము.ధర్మవిష యకము. ఉత్సాహము స్థాయి భావము. ధర విషయ కోత్సాహమునకు ఆలంబనము సత్యవంతాది గురుజనులు. యముడు ప్రత ట ఉద్దీపనము. సంభ్రమము, అంజలి యొనర్చుట, ప్రౌఢ మధుర సల్లాపము మొద నవి అను భావములు.

'పతులెందు జనిన నచటికి
సతులకుఁ జనవలదె? నీ ప్రసాదముననను మ
త్పతి భక్తి కతమ్మునను సం
స్తుతగుణ నాకరుగరాని చోటులు గలవే' (7–222)

'సకల మార్గంబులందును ధర్మమార్గంబు ప్రధానంబు. అట్టి ధర్మమునకు ఆధారంబు సజ్జనులు...... అట్టి సజ్జన ధర్శనం బెప్పుడు వృథకాదు. కావున సజ్జన శేఖరుం డ వనం జమునీ దైవ సందర్శనంబునం బరమశుభంబునం బొందక యేనురిత జనంబుల తెఱంగున మూఅక యెట్లు మగుదుదు? ...' (7–223)

'ఎడపక వాఙ్మనః క్రియల నేరికి నెగ్గొనరింపఁబూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవనఁ జూతు రిచ్చుచో
కడమ వడంగ నీకెడిరి కాంక్షితములు ది ముట్ట దీరు రె
క్కుడు మది గూర్తు రాశ్రితులకున్ వినుమిన్నియు నార్యధర్మముల్' (7–228)

''వానియందు సావిత్రి పత్యనుగమన విధిని, సజ్జనుల ధర్మరక్షణ రీతిని అప్రస్తుత ప్రశంసా వచనములచే నిరూపించినది.

''పిమ్మట ధర్మదేవతా, యమ, శమన శబ్దములకు నిరుక్తుల ప్రవచించినది.

....

దేవోత్తమ ధర్మ గతుల తెఱగెల్ల భవ
ద్భా వాధీన మగుటగా
దే వెలసితి నీవు ధర్మదేవత యనఁగాన్' (7–229)

'సమ బుద్ధితోడఁ దత్త
త్సముచిత కర్మఫల మ్మిల జన్తుతతులకున్
సమకూర్చుట నీకయ్యెను
సమ వర్తి యనంగఁ బేరు ఱగ జ్ఞాతమ్మై' (7–230)

'యముడం(దు నిన్ను నార్యులు
యమింతు భూతములనెల్ల నట్లగుట దగున్
శమనుండవై తి కల్మష
శమనంబునఁజేసి నీవు జలజావ్ర సుతా' (7—231)

'పిమ్మట సావి(త్రి ధర్మాచరణ రీతిని, స్వీయ ధర్మమును, ధార్మికుల మాహాత్మ్యము, మి(త్రధర్మమును, పరమనోరథపూరణమును గూర్చి యుపన్యసించెను.

"ధర్మాత్ములు దమ సలిపెడు
ధర్మ(క్రియ దప్పరెట్టి దశలందును, మో
హోర్మియఁ దాపముఁబుట్టవు,
ధార్మిక హృదయముల (ప్రథమ ధర్మాధ్యక్షా!"

'కావున పతి యనుగమనం
బే విధమున విడువదగునె యెట్లయినను
మోహావేశముఁబొందక ధ
ర్మావ స్థితి సలుప వలదె యవహిత బుద్ధిన్' (7—237, 238)

"నాకు దప్పి యెక్కడిది మనంబు భర్తృ
చరణ పంకజాసక్తమై కరము భక్తి
నలరుచున్నది సతులకు నన్యమెట్టి
దియును ధర్మమై భర్తృ సం(శయము కాక"

"ఆత్మ ధర్మ నిరతులైన పుణ్యాత్ములు
దుర్గతులు సమస్త దురితములును
శాంతి బొందువారి సంసర్గమున దీర్ఘ
పూత మతులువారు భూతలమున

వారల పేర్మిగాదె....భూతధా(త్రి వికలైక ధురీణతఁ బేర్మి బొందెడున్'
(7—241,243,244)

'ఏడు మాటలాడిన యంతనెట్టివారు
ఆర్యజనులకుఁ జుట్టంబు లగుదు రటిన

చిర సమాలాప సంసిద్ధిఁ జేసి నీకు
నేను జుట్టమౌదని వేఱయేల చెప్ప?

'కావున మిత్ర మనోరథం బవశ్య కర్తవ్యంబుగాఁ జిత్తగింపుము."(7-246,247)

"ఈ పైవాని యందు ధృతి, మతి యను సంచారి భావములు అభివ్యక్తములై ధర్మవీరమును-పోషించుచున్నవి. లోభము, శోకము, భయము మున్నగు వానిచే జనించిన యుపప్లవము (చిత్తక్షోభము) వారింప కారణభూతమగు చిత్తవృత్తి విశేషము ధృతి. శాస్త్రాది విచార జన్యము అర్థ నిర్ధారణ రూప చిత్తవృత్తి విశేషము మతి. అది శబ్దముచే లోక వృత్తము గ్రాహ్యము. శాస్త్రలోకవృత్తాది విచారణ విభావము.నిశ్శంక తదనుష్ఠానము. సంశయోచ్ఛేదము (శిష్యోపదేశము, భ్రూక్షేపము, ఊహాపోహాదులు) అను భావములు.

''సత్యవన్నిష్ఠము ధర్మవిషయకము ఉత్సాహము స్థాయిభావము. మాతా పితృగురు జనులు ఆలంబన విభావము.

"ఎను నీవు దడయుటకు మీ
జననియు జనకుండు కడు సంతాప భరం
బును బొందుదు రింతకు గ్ర
న్నన వారికి సంతసం బొనర్పవె యధిపా"
"తమమును బెల్లగాఁబరగె దవ్వు నిజాశ్రమ భూమియున్ తను
శ్రమమును బాయది నను చందమయెనఁ జనంగ నేల యిం
పమరగ నింత ప్రొ సుగుణాకరః యిచ్చట నిల్చి రేపు పోదమే..."
(7-256, 258)

అను వాక్యములుద్దీపనములు.

"మానె శిరోవేదన దా
మేనికిఁ దగులావు వచ్చె మెల్లన యరుగం
గానోర్తుఁ దల్లిదండ్రులఁ
గానక యేనెట్లు నిలుతు కానన భూమిన్?" (7-259)

"అను దానియందు వీరరసమునకు సంచారి భావము ఔత్సుక్యము పోషితము.

"ఇప్పుడే తల్లాభము నాకుఁ గల్గుఁగాక" అను నుత్కంఠచే ఔత్సుక్యము. ఇట ఇష్టవిరహమున తత్సంస్మృతి విభావము. త్వరచింత (చిత్తతాపము), స్వేదము, దీర్ఘ విశ్వాసము మున్నగునవి అనుభావములు.

"పిమ్మట గల ఆరు పద్యములందు పోషింపబడిన చింత, స్మృతి, విషాదము' ఔత్సుక్యమున కను భావములు.

"ఇట్లు సావిత్రీసత్యవంతులయందలి ధర్మ విషయ కోత్సాహమును ఉపాఖ్యానితముగా పోషించెను.

"ధర్మ వీరమునకు పర్యంతావస్థ అద్భుతము. అలౌకిక వస్తు దర్శనాది జన్యము వికాసౌఖ్య చిత్తవృత్తి విశేషము విస్మయము. అద్భుత రస సాయి భావము. సావిత్రి ధర్మవీరమునకు అవ్యవహిత ఫలములు సత్యవంతునకు జీవిత ప్రాప్తి. విగత చక్షుడగు ద్యుమత్సేనునకు నేత్రదృష్టి ప్రాప్తి, ద్యుమత్సేనునకు రాజ్యప్రాప్తి, అశ్వపతికి పుత్రశత ప్రాప్తి విలంబిత ఫలములు. పుత్రునన్వేషించుటకు ద్యుమత్సేనుడు అరణ్యాశ్రమముల విలపించుచు బోయి వెదకెను. "తదాశ్రమ వాసులైన మునులందరు నతనిం బొదివికొని తదీయ నయన లాభంబునకు విస్మయంబందుచు" (7-271) అని కవియే సూచించెను.

"సావిత్రీ సత్యవంతులు జరిగిన దానిని వర్ణింపగా, ఆ వృద్ధ దంపతులు సావిత్రిని—

"అపత్సముద్రమగ్నం
బై పోయెడు నస్మదన్వయము పెంపెసగం
దేపయయి కడవఁ బెట్టిన
నీ పుణ్య చరిత్ర కీర్తనీయము తల్లీ" (7—274)

అని ప్రశంసించిరి. ఇందు హర్షమను భావము వ్యంగ్యము.

"ఇది లోకోత్తర ధర్మ నిర్వర్తితము కావున విస్మయ పూర్వకము. విస్మయ పూర్వక హర్షము కించిదుద్ధతము కావుననే కించి దుద్ధత ప్రసాద మిశ్రితముగా పద్యరచన మొనర్చెను."44

తపోవీరం :

హిరణ్య కశిపుని ఘోరతపస్సులో తపోవీరముంది. ఇంద్ర ప్రేరితలై అతనిని తపస్సునుంచి మరలింప యత్నించి అప్సరసలు నిఫలలవుతారు. ఘోర తపస్సు నిష

తప్పకచేసి బ్రహ్మవలన వరాలు పొంది గర్వితుడవుతాడు. అయినా ఎన్ని విఘ్నాలు వాటిల్లినా లెక్క చేయక ఘోర వీర తపమాచరించి బ్రహ్మవరాలకు పాత్రుడు కావడంలో తపో వీరం వర్ణితం.45

వీరాభాసం :

ఇంతకు ముందే హాస్యరసానికి ఉదాహృతమైన శిశుపాలుని స్థితి హాస్యస్ఫోరక మనడం కంటే వీరాభాసమనడమే సముచితం.

"అనునెడ శిశుపాలుండొక
ఘన పరిహాసము కేలదాల్చి గ్రక్కున జన నా
థుని యెదురనిల్చి"

"పెండ్లియాడుదునని కడుఁ బేర్మితోడ
నిట్టుగై సేసి తుదినింత యెడరునొంది
యున్న నాకుఁ గా కీ యొవ్వ మొుఱుల కేమి
గారణము నిల్వుఁ డెవ్వాడుఁ గడల వలదు" 46

అని బీరములు పలికినా, శ్రీకృష్ణుడు బలోద్ధతుడై రుక్మిణిని రథంపై నెక్కించుకొని, ఎదిరించిన సర్వరాజన్యుల్ని జయించి తీసుకొనిపోగా శిశుపాలుని వీరత కేవలం ఆభాసపాలైంది. అందుకే డా॥ యశోదారెడ్డిగారు హాస్యానికి దీనిని ఉదాహరించినా 'చివ అకీ పద్యమందు వీరమాభాసమై హాస్యమే స్థిరపడినది."47 అని పేర్కొన్నారు.

ఈ విధంగా ఎఱ్ఱన తన సాహిత్యంలో వీరరసాన్ని పలు విధాలుగా అలవోకగా సందర్భ శుద్ధితో ఔచితీ సహంగా నిర్వహించి తరించాడు.

## 3.1.6 భయానకం :

తదితర రసాల లాగానే ఎఱ్ఱన భయానక రసానికి సైతం తన సాహిత్యంలో స్థానం కల్పించాడు. భయానక రసానికి స్థాయి భావం భయం.

అరిష్టుడను రాక్షసుడు వృషభ రూపధరుడై కలిగించిన భయంతో ఉత్పన్నమైన భయానక రసాన్ని కన్నులకు కట్టినట్లు ఎఱ్ఱన వర్ణించాడు.

"కాల కూటమునకుఁ గరచరణాద్య వ
యవములు ప్రభవించి యలరె ననఁగఁ
బ్రళయోద్ధత ధ్వాంత పటలంబునకు శరీ
రిత్వ విస్ఫూర్తి వరి ల్లెననఁగ
రాహునంత్యక్త ఘోర కళేబరమునకుఁ
బశు భావ పరిణతి పరగెననఁగఁ
గలికాల సమ్ముఖ కలుష రాశికిఁ జతు
రంఘ్రితాపై దగ్గియలరె ననఁగ

నతి భయంకరంబగు కఠోరాసితాంగ
మెనఁగ నీలాద్రి వృషభమై యేగు దెంచు
కరణి నుత్తుంగ తీవ్ర శృంగముల తోడఁ
జటుల ఖుర పాత పాటితక్ష్మాకుఁదగుచు"42

—ధేనుకాసురుడు మహాభయంకరంగా ఆలమందలను బదాబదలు చేయడంలో భయమూ, తన్మూలంగా అత్యంత హృదయ భీకరమైన భయానకరస మూడుప్పతిల్లుతూంది.

ఇలాగే కంసుడు కువలయాపీడమనే ఏనుగును బలరామ కృష్ణుల పైకురికి సంహరించుమని ఆదేశిస్తాడు. ఆ ఆదేశానుసారం

"చటులోగ్రశీకరచ్ఛటలు పెల్లుగఁగాల
దండ ప్రచండమై తొండమమర
నశికుల ఝంకారములు రేఁగ మదజలో
త్కటముల్లై యందంద కటములదరఁ
గన దగ్ని కణ సముత్కరములఁ బెంచి యు
త్యు గ్రారుణేక్షణద్యుతులు నిగుడఁ
జలిత చామర శిఖాశాత్కారముల తోడఁ
దగు కర్ణ తాడన ధ్వనులు పర్వ

మొగము క్రోధమయంబుగ బిగిసి మేను
వొంగఁ బద పాత భుగ్నమై భువి చలింప
దీర్ఘ దంత కాండంబులుద్వృతిఁ జూవ
గదిసెనేనుంగు లోక భీకరము గాఁగ"43

కాని కృష్ణుడు చూపరులకు వినోదం చూపించడానికి దానితో యుద్ధం చేసి చివరికి దాని దంతం లాగి దానితో సంహరించాడట. ఇక్కడ ఆ యేనుగు ఎంత భయంకరంగా ఉందో తదుచిత రీతిని శబ్ద ప్రయోగం చేసి తన్మూలంగా మనకు దృశ్యసాక్షాత్కార మొనరించి, అనంత భయానక రసంలో మనల్ని సైతం ముంచి వేసిన కవిశేఖరుడు ఎఱ్ఱన.

చాణూర ముష్టికులను మల్లవీరులను జయించి కంసుని గాంచిన బలరామ కృష్ణులు చూపరులకు భయం గొల్పడం వర్ణితం.

"ఇవ్విధంబున జాణూర ముష్టికుల వధియించి
రంగ తలంబంత యుందారయై రామకృష్ణు
లిద్దఱుం గ్రోధ సంరక్త లోచనంబులఁ గంసు
దెసఁగనుంగొను నప్పుడప్పుప్పునకుఁగంస
క్రౌర్యంబునకు నంద గోపాదులగు ఘోషజనం
బు లందఱుందల్లడంబుల నందంద మేనులు వ
డంక నొక్క దెసనుడిగి ముడిఁగి యుండిరి, తక్కిన
వారునుఁ బల్లవడి చూచు చుండిరంత"[50]
ఇందులో భయానకరసం చక్కగా అభివర్ణితం.

హిరణ్యకశిపు సంహారార్థం విష్ణువు నృసింహావతారం ధరించిన తీరులో భయానక రసం చిత్రితం.

"స్కంధ విధూనన స్ఖలిత సటా సమీ
రమున ఖేచర విమానములు దూల,
దంష్ట్రా సముద్ధత దహనచ్ఛటా నిపా
తంబున దిగ్వదనంబు లెరియ,
క్రోధ తరంగిత ఘోర నిశ్వాస వే
గమునఁ బాధోధి పూరములు గలఁగ,
దర్ప సంభృత మహోదగ్ర హుంకార ఘో
షమున బ్రహ్మాండోదరములు వగులఁ

గలుష నేత్ర కనీనికా కపిల రోచు
లరుణ శశభృన్మరీచుల నాక్రమింప
నమరు నరసింహమూర్తి యొప్పారఁ దాల్చి
విభుఁడు దైతేయు నెదుర నావిర్భవించె."

"అట్టి దారుణ రూపంబు నాలోకించి యాతోకకంటకుండు కంటకితాంగుఁ డగుచు భయ విస్మయ రసంబుల మునింగియు ..................."[51]

ఇది హరి వంశం లోనిది. ఇలాగే నృసింహ పురాణ మందును నృసింహావతార వర్ణన గమనించదగ్గది. విషయ మొకటే అయినా భయానకరసపోషణలో ఎఱ్ఱన రచనా పాట వాన్ని వైవిధ్యాన్ని గమనింప వీలవుతుంది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో స్తంభంలో విష్ణు వున్నాడా అని ప్రశ్నించగా అన్ని ప్రదేశాలలో ఉన్నాడని సమాధానం చెప్పగా హిరణ్యకశిపుడు—

''అనవుడు రోష హాస వివృతాననుఁడై దివిజారి యోరి! నీ
వనయము నెందుఁ గల్గఁగ సమర్థనఁ జేసిన యాతఁడిందుఁ గ
ల్గునె యనుచున్ జగద్వలయ ఘోరకరాహతి వ్రేసెఁగంబము
త్యనుపమతత్ప్రభాభవన మల్లల నాడఁగలంగ లోకముల్''[52]

''బడబాన లాహతి జడనిధిలో నున్న
పటు శైల తతి వ్రేలి పెటిలెనొక్కొ,
ఘనతరోత్పాత నిర్ఘాత సహస్రంబు
గడఁగి యొక్కట మ్రోసి పడియె నొక్కొ
పెక్కు జీవులు లోన బిక్కటిల్లు వడఁగ నా
బ్రహ్మాండ భాండంబు వగిలె నొక్కొ
తటి గాక యున్న నుద్ధతి జేర్చి రుద్రుండు
విలయోగ్ర పటలంబు వ్రేసె నొక్కొ

యనఁగ నాకాశ సకల దేశావకాశ
భరితమై విశ్వమును మూర్ఛ పాలు పడఁగ
మొనసి పెఢిలు పెఢిల్లను మ్రోత వెడలఁ
బగిలెఁ గంబంబు భువన కంపంబు గదుర''[53]

అప్పుడు నృసింహావతారమైనది. ఇందు భయానక రసం సముచిత రీతిని నిర్వ హించబడి సందర్భ శుద్ధి కలిగి ఉంది.

హిరణ్యకశిపునిచే ప్రేరితుడై ప్రహ్లాదునిపై మాయలు పన్న యత్నించిన శంబరా సురుని ఔద్ధత్యంతో భయానక రసం ఉప్పతిల్ల జేయడం గమనించవచ్చు.

"కుల శైలంబులు పడఁకెను
గలఁచెఁ బయోధులు పయోజగర్భుడు సురలున్
దలకిరి మునుల మనంబులు
గళవళ మయ్యెన్ దదీయ సత్వోద్ధతికిన్"54

ఇలాగ సరళంగా చెప్పి ఎంతో భయోత్పాతాలు గలుగ జేయడం ఎఱ్ఱన ప్రతిభ కు నిదర్శనం.

సైంధవుడు ద్రౌపదిని హరించుకొని వెళ్ళుతుండగా ద్రౌపది చెప్పిన మాటలలో భయానకరస నిష్పత్తిని ఎఱ్ఱన గావించినాడు.

"గాండీవరేఖ యాఖండలు చాపంబు
కరణిఁగాఁ దద్గుణ క్వణము ఘోర
గర్జగా నవిరళ గంభీరవీర ర
సాపూర్ణమై సంతతా వలిప్త
శత్రు ప్రతాపోష్ణ సమయంబు శమితంబు
గా మిత్ర బర్హి కేకారవంబు
లెసగంగఁదోతెంచి యింద్ర నందన మహా
జలధరం బాయత సాయకోర
వృష్టి ముంచుటయును వెరగంది నిలఁవంగ
వలవి గాక వఱచునప్పు"55 డు,

నీవే గురి సావని అర్జుముని బల పరాక్రమ సంపదను వివరించి తన్మూలంగా భయానక రసాన్ని అభివ్యక్తీకరించింది.

ఇలాగ ఎంతో గంభీర సుందరంగా సందర్భ శుద్ధితో, ఔచితీ సహమై ఒప్పు నట్లు, నిశితైన మాటల పొంపులతో ఆనేక సన్నివేశాలలో వివిధరీతుల భయానక రసాన్ని తన కృతులలో వ్యంజింప జేసి తన ప్రతిభాపాటవాన్ని ప్రకటించాడు ఎఱ్ఱన.

## 3.1.7 బీభత్సం :-

ఎఱ్ఱన రచనల్లో బీభత్సరస పోషణ కూడా సందర్భోచితంగా సాగింది. ఆయా వ్యక్తుల్ని, సన్నివేశాల్ని జుగుప్సాయుతంగా వర్ణించి, బీభత్స రసావిష్కరణం గావించిన విషయాన్ని పరికిస్తే ఎఱ్ఱన ప్రతిభ వ్యక్తమవుతుంది. బీభత్స రసానికి స్థాయి జుగుప్స.

దుర్వాసుని రాకలో ఇది విదితం.

''మతి నత్యంత జుగుప్సితం బయిన యున్మత్త స్వరూపంబుతో
గత వస్త్రుండును ముక్త కేశుఁడు బహుగ్రామ్యోక్తి శీలుండునై
హిత పుణ్యుండు మునీశ్వరుండతిథియై యేతెంచె దుర్వాసుఁడన్
యతి యమ్ముద్గలు పాలికిన్ ఇటు బుభుక్షాయత్తచిత్తం దూలుచున్.''[56]

ఇందులో దుర్వాసుని, ఆకార మెంత జుగుప్సాకరంగా ఉందో స్పష్టం చేయబడింది వాచ్యంగా. తన్మూలంగా బీభత్స రసం పోషింపబడింది.

గంధర్వులను అర్జునుడు జయించిన సందర్భంలో బీభత్స రసం చిత్రితం. ఆతని పరాక్రమం సైతం స్పష్టం.

''అవి యెల్లం దునుమాడి క్రీడి ఘన రోషాభీలుఁడై శాత ఫ
ల్లవితానంబడరించినం దలలు డొల్లం గాయముల్ మింటనుం
డి వడిం గుంభినిఁ గూలఁగా రుధిర వృష్టిం గాలువల్ వాఱగా
దివి గంధర్వుల క్రందదంగె జగ ముద్వేగంబునం బొందఁగన్''[57]

ఇలాగే సైంధవుని పై దండెత్తిపోయినప్పుడు అర్జునుడు పన్నిద్దరు సౌవీర కుమారులను సంహరించిన సందర్భంలో అతి జుగుప్సాకరమై బీభత్స రస పోషణ చణత్వాన్ని ఎఱ్ఱన ప్రకటించాడు.

''అప్పుడు రణ భూమి యంతయు శవమయం బయ్యె నంబరంబంతయుఁ గబంధ మయం బయ్యెఁజారుకేయూర హీరాంక విభూషితంబులైన బాహు చరణచ్ఛేదంబులును ............... కీలాల పూరంబులును, మాంస పంకంబును గేశ శైవాలంబును నైన యపూర్వ నదీ ప్రవాహంబునందు బహువిధ క్రవ్యాద గణంబు లవగాహంబు సేయుచుఁ బ్రకట కోలాహల వ్యాకులంబగుచుండె ...............''[58]

అత్యుత్తమ కవిశేఖరుడుగా ఎఱ్ఱన అభివర్ణించి జుగుప్సావహమే అయిన బీభత్స రసాన్ని సైతం నిష్పన్నం చేయడంలో దిట్ట అనిపించుకొన్నాడు.

నృసింహుడు హిరణ్యకశిపుని సంహరించడంలో బీభత్స రస స్ఫూర్తి ఉంది.

"అలఘుత రాట్టహాసము లజాండకటాహముఁ బ్రయ్య భీషణో
జ్జ్వల వికట స్ఫురత్కులిశశాతనఖాంకుర తీవ్రపాత నం
బుల నసురేంద్రు పేరురము బొల్పుఱఁ జించి కలంచి శోణితం
బులు దొరగించెఁ ద్రుంచెఁ బెనుప్రేవులు ప్రోపుగా బలుప్రేవులుక్కునన్"[59]

కృష్ణుడు గాంచిన ప్రసేనుని కాయం బీభత్సావహమై ఉంది.

"బలవత్సింహచపేట పాటిత తను ప్రభ్రష్ట భూషాంబరా
కుల కేశ ప్రకరుం గరస్ఖలితఖడ్గున్ముక్త పల్యాణసం
వలిత గ్రీవ వికీర్ణ కేసరమృతాశ్వ ప్రాంత సంస్థున్ రజః
కలుషశ్మశ్రుముఖుం బ్రసేనుఁ గనియెన్ గ్రవ్యాదసంవేష్టతున్"[60]

కృష్ణుని ముష్టి ఘాతం వల్ల మరణించిన చాణూరునిస్థితి బీభత్స రసానికి తావలం.

"అట్టి బెటిదంబుఁ జేతల వలన గ్రుడ్లు వెలికుటికి పండ్లు దెఱచి నోర ముక్కున నెత్తురులు వెడలి వాడు కులిశపాత భగ్నంబైన శైల శృంగంబు భంగింబడి వికృతంబుగా నొఱలుచు విగత జీవుండయ్యె ........................"[61]

ఒకానొక కారణం వల్ల వ్రేపల్లెలో గోగోపకులకు కలిగిన దుర్దశ బీభత్సరస నిర్భరం.

"వడకుచు రోమకోటి నిలువంబడి మేనులు దూలఁ గన్నులం
దుడుగుక బాష్పముల్ వడియుచుండఁ దలల్ దిగవైచి నోరఁ దే
గుడు దొరుగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు వ్రస్సి పుర్వులు
గ్గడువుగ గాఱఁ దద్దయును గాఱియఁ బొందె వ్రజంబునందుపశుల్"[62]

— అంతటితో నాగలేదట. గోప ప్రకరంలోను ఇది వ్యాపించిందట.

"జ్వర వేగమునఁ దూలి పొరలిరి కొందఱు
సందు సందులు సొచ్చి చదిసిపడిరి,
కొందఱు వెస రోమకూపంబులన్నియు
నవసి నెత్తురు గాఱ నవయవములు
చీములు గట్టంగ శీర్ణంబులై దంత
ములు గదలంగ నెమ్ములు నొగులఁగఁ
గంఠ జిహ్వాధర ఘ్రాణ కర్ణంబులు
పొక్కులై యేర్పఁగ నొక్కఁడై న
ద్రావఁ దడవ లేక తల చీర లెఱుఁగక
యారులై రి కొంద అంత వట్టు
గోప మందిరములు తాప దుర్గంధమ
యంబులయ్యె వికృతి యగ్గలింప"63.

ఇలాగా వివిధ రీతుల జుగుప్సావహంగా బీభత్స రసాన్ని చిత్రించాడు ఎఱ్ఱన. దీని వల్ల కవికి గల లోకజ్ఞత ముఖ్యంగా పల్లె జీవిత రీతి నెరిగిన తీరు తెలుస్తుంది స్పష్టంగా.

### 3.1.8. అద్భుతం :

ఎఱ్ఱన అద్భుత రసానికి అధిక ప్రాధాన్య మిచ్చినట్లు తెలుస్తుంది. అద్భుత రసానికి స్థాయి భావం విస్మయం. అపూర్వార్థ సందర్శనం వల్ల కలిగే విస్మయమే స్థాయి అయి సహృదయ హృదయాలలో అద్భుత రసావిర్భావానికి ఆస్కార మవుతుంది. తన్మూలంగా ఆనందం అనంతంగా కలుగుతుంది.

హరివంశం అద్భుత రస నిర్భరం. శ్రీ కృష్ణుని చరిత్ర అంతా అద్భుతానికి ఆటపట్టు. దీన్ని ఆసరాగా తీసుకొని ఎఱ్ఱన మరింత మనోహరంగా అద్భుతరసాన్ని వ్యంజింప జేయడం ఎంతైనా ప్రశంసించదగ్గ అంశం.

శ్రీ కృష్ణుడు జన్మించినది మొదలుకొని కంసప్రేరితులైన దానవుల్ని సంహారం చేయడంలో, గోవర్ధనోద్ధారం గావించడంలో, కంసుని వధించడంలో, జరాసంధుడు పర్వతానికి చిచ్చు పెట్టగా అందు విహరిస్తున్న శ్రీ కృష్ణబల రాములు పర్వతం పై నుంచి దూకి శత్రు సంహారం చేసి, జరాసంధాదులను పరాజితులను చేయడంలో, ద్వారకా నిర్మాణంలో అన్నింటా ఈ అద్భుతరసనిర్భరమై హరివంశం ఒప్పుతుంది.

ఎఱ్ఱన అద్భుత రస నిర్వహణచణత్వానికి చక్కటి అవకాశం కల్పించు కొన్నాడు. అగ్ని రగిల్చిన పర్వతం నుంచి బలరామ కృష్ణులు లంఘించడంలో అద్భుత తనం ఉత్పన్నమవుతుంది.

"......... ......... ఆ క్షణంబ యాక్షిప్త మణికుండలుండును, నాకంపిత మణి కిరీటుండును, నాందోళిత నీలాంబరుండును, నాలోల వనమాలావలయుండును నగుచు వాసుదేవాగ్రజుం డన్నగాగ్రంబున నుండి రాజన్య మధ్యంబునకు లంఘించినం దోడన చూడారత్న రోచులు చెదరం బీతవాసోంచలంబు చలింప, శ్రీవత్స లాంఛన శ్యామికలు గడ లొత్త నుదాత్త స్మిత మరీచులుల్లసిల్ల నుత్ఫుల్ల కమల నయనుండగుచుఁ గమల నాభుండు నుఱికె నయ్యిద్దఱు బెట్టి దంపుఁ ద్రొక్కు నం గ్రుంగఁబడి గోమంత మహీధరం బహులోక గతంబగు సలిలంబు వెలిఁబేర్చి తొప్పఁదోఁగె నివ్విశేషంబు వలన విద్వేషి కృతంబగు దహనోపప్లవంబు ప్రశాంతంబయ్యె ........."

"మందరాద్రులు రెంటొక్క మాటు పడిన
కొలది కగ్గలముగ బిట్టు గలగు జలధి
పోల్కి రామ కృష్ణాపాత భూరివేగ
సంక్షుభితమయ్యెఁ బార్థివ సైన్యమెల్ల''64

''అంత''

"బాహు ప్రహరణులై యతి
సాహసికులు యదు కిశోర సత్తములు రిపు
వ్యూహ శతంబుల నత్యు
త్సాహంబునఁ గూల్చుటద్భుతం బయ్యె నృపా''

"ఆ సమయంబున నమ్మహానుభావుల విక్రమంబుల కనుగుణంబులుగా నమర ప్రేరణమున''

"చను దెంచెన్ దివినుండి తోయధము లాశ్చర్య ప్రభాధుర్యముల్
ముని గీర్వాణ పరంపరా వి[illegible] సమ్మోదంబు లున్మాది హ్వా
ద్దనుజేంద్రక్షత జార్ద్ర[illegible] మాత్యద్భూత జేతాళ కీ
ర్తన కల్యాణవిధి ప్రసిద్ధ బహు సంగ్రామం బులుద్దామముల్"65

"అమ్మహా సాధనంబులకుం దగునట్లుగా వారికిం బూర్వంబులగు నిజ దివ్యా కారంబులు నుదారంబులై పొందె నప్పుడు సుదర్శనశార్ఙ్గకౌమోదకీ నందకంబులు గోవిందుండును సౌనంద సంవర్తకంబులు నభాణ బాణాసనంబులుగాఁ బ్రబలంబవైరి యుం బరిగ్రహించి రనంతరంబ యనంతాంశసంభవుండు సంరంభ విజృంభితంబగు బాహు మండలంబు చండశస్త్రోజ్జ్వలంబై దంష్ట్రా కరాళంబగు ఫణి వక్త్రంబు క్రర లీన్"[66] యుద్ధంచేసి జరాసంధాదులను జయించి పారదోలడంలో అద్భుత రసం పరిపోషితం.

విజయంతో మధురకేతెంచిన బలరామ శ్రీకృష్ణులకు యాదవులు స్వాగతం పలికి వారి అద్భుత కృత్యాల్ని ఏకరువు పెట్టి ప్రస్తుతించడం :—

"చెనటి చాణూర ముష్టికుల ఖండించుట
కంస విధ్వంసన కలిన లీలఁ
దనయట శత్రుని తండ్రిఁ బ్రతిష్ఠించు
టబ్ధిలోఁ దిమితోడి యాహవంబు
గోమంత నగమున శ్రీమెఱయంగ ను
దాత్త దివ్యాయుధావాప్తి మహిమ
భూమీశ్వరులతోడి భూరి సంగ్రామంబు
కరవీరవిభుని సృగాలుఁగూల్చు
టర్థి మధుర కేతెంచుట యచటఁ జిత్ర
జయము ద్రమ్మఱుగొనుట యీసరణి నీవు
నమ్మురుడును జరించిన యద్భుతంపుఁ జరిత
మెన్నఁగొనియాడ నెవ్వర మిప్పుడేము"[67]

అక్రూరునకు హ్రదంలోను, రథంలోను బలరామ కృష్ణులొకే రీతిని గోచరించడం అద్భుతావాహం.[68]

శ్రీ కృష్ణుడు గురుపుత్రుని సముద్రంనుంచి తెచ్చి ఇవ్వడంలోనూ అద్భుత రస ముంది.[69]

గోవ ర్ధనోద్ధారం చేసి గోపకుల ... ంత భయంకర వర్షపాతము నుంచి సంరక్షించడం అ ... త రసానికి తావతం.[70]

ఇలా వివరిస్తూ వెళ్ళితే హరివంశమంతా అద్భుతరసానికి ఉదాహరణగా చెప్ప వలసి వస్తుంది. ఈ అద్భుతరసాన్ని అత్యంత ప్రీతి పాత్రంగా మనోహరంగా ఎఱ్ఱన వర్ణించాడని వివరించిన నోరి నరసింహశాస్త్రిగారి అభిప్రాయాన్ని గ్రహించడం అనుచిత మేమీ కాదు. అంతేగాదు అతనికి (ఎఱ్ఱనకు) అద్భుతరసము అభిమానరసము. అద్భుతము, అద్భుత రసము అను మాటలు ప్రయోగించి నన్ని మారులు శ్రీ కళ్యాణ శబ్దములు తప్ప మరియేమియు నితడు ప్రయోగించలేదు. ఈ మూడు శబ్దములును అతనికి అలవాటైన ఊత పదములా యేమి అనునట్లు తిరిగి తిరిగి వచ్చుచుండును. అద్భుత శ్రీకళ్యాణములే అతని నావేశించి గ్రంథములు పలికించినవా? అవియే యతని కవిత ధర్మములా? శ్రీకళ్యాణములు వేరుగా విచారింతము. ఈ అద్భుతమును ముందు కొంత పరామర్శ చేయుదము.

"తార్క్ష్యుని యాశ్రమములో చనిపోయిన బాలకుని మహాద్భుతాత్ములై చూచిరి. వైవస్వతుని యెడకు మత్స్యము అద్భుత వేగంబున నీడ్చెను. బాలకృష్ణు డప్రళయ కాలములో అద్భుతాకృతి నుండునట. ధర్మజుడు మార్కండేయముని ప్రసాదమున నత్యద్భుత కథా శ్రవణ పరిపోషితుడయ్యెను. మార్కండేయుడు తనకంటె వృద్ధతముల నెరిగించుట మహాద్భుతమట! కువలయాశ్వుని తండ్రితో ఉదంకుడు 'విను మొక్క యద్భుతంబు సెప్పెద' నని ప్రారంభించెను. కౌశికుడు ధర్మవ్యాధుని తో 'నీ చరిత్ర ముంగనుమతి నద్భుతం బొలసె' ననెను. పాంచజన్యుడను పావకుడు పుట్టగా 'తద్దయు నద్భుతమందె లోకముల్'. కుమారస్వామి ముఖమున 'నద్భుతముగ నుదగ్ర దహన శిఖావళు' లుద్భవించెను. ద్రౌపది కేవురు భర్తలు సమరక్తులగుట యద్భుతము. ధృతరాష్ట్రుడు పాండవుల యరణ్య వాసము విని "ఇట్టివి గదా వివిధాద్భుత కర్మపాకముల్" అనుకొనెను. జనమేజయుడు అద్భుతంబగు దుర్యోధనుని చరితము చెప్పుమని యడిగెను. ద్రౌపది భీముని వీర్యము 'అనేక మద్భుత' మని వర్ణించెను. 'అతలంబునం గ్రుంగిన నద్భుతముగ దివమునకు నెగసి పోయిన సైంధవునిం దెత్తు' మని భీమార్జునులు ప్రతిజ్ఞ చేసిరి. వానరులు భూవివరము అద్భుతముగ గనిరి.

"మరియా నిట్లెన్నిమారులు అద్భుత శబ్ద ప్రయోగము చేసినాడో లెక్కించిన గ్రంథము పెరిగిపోవును.

"అద్భుత ధన్య శబ్ద వాచ్యుడెవడో వానికై నారదుడన్వేషించిన మనోహరమగు నొకయాఖ్యాయిక హరివంశములో నున్నది. నారదుడు ముందొక కూర్మమును చూచి

దానికా శబ్దము లన్వయించెను: కూర్మము గంగయే యందుకు తగుననెను, గంగ సాగరమే అందుకు పాత్రమనెను. సాగరము భూమిని నిర్దేశించెను. భూమి తన్ను ధరించు కులగిరులను జూపెను. కులగిరులు విశ్వమునకు పితామహుండాధారము గనుక పరమాద్భుతము నధిక ధన్యమునగు మహాభూతంబతండే' యనెను. నారదుడు బ్రహ్మను అద్భుత ధన్య పదములతో సంబోధింపగా నతండదరిపడి యట్టి ప్రభావము కలది వేదములే యనెను. అంతట నారదుడు వేదముల నాదరించి సాక్షాత్కారంబు నొనరించుకొని బ్రహ్మ వాక్యములివియని చెప్పెను.

"అనవుడు వేదములు తపో
ధనవర యాశ్చర్య ధన్యదశ కర్తలమే
యనుపమ మహత్వకలితము
లనంతములు యజ్ఞములు సమగ్రోదయముల్"

"ఏము గలుట యెల్లను యజ్ఞార్థంబ యజ్ఞంబులు లేనినాడు మా కలిమియు నిరర్థకంబ మాకుం బరమ పరాయణంబులు యజ్ఞంబుల కా నెలుంగుము అనెను. అంతట నారదుడు యజ్ఞంబుల బ్రత్యక్షంబు గావించి అద్భుత ధన్య శబ్ద వాచ్యములుగాఁ బలికి వాని పరమ ప్రభుత్వము కొనియాడగా నధ్వరమ లిట్లనియె :

"మాకాత్మ విష్ణుడాతడు
గైకొని నడపంగఁ జెడక కలుగు నిరుపమో
త్సేకం బగ్నియు హవియు న
నాకుల మంత్ర ప్రభుతతు లతఁడ మునీంద్రా"

"ఇట్లగుటంజేసి యాశ్చర్యధన్య శబ్దంబులు రెంటికి వాచ్యుండమ్మహా పురుషుండని చెప్పిన యధ్వరంబుల పలుకులు విని"

"యాదవ గోష్ఠిలో శ్రీకృష్ణ భగవానుడుండగా సకల జనశ్రోత్ర సుందరంబగు చందంబుగల యెలుంగునఁ గమంగొని

"అమరులు లోనగు జనముల
నమితాద్భుత కీర్తితో మహాధన్యుఁడ వో
కమలాక్ష నీవు, నీతో
సము లెవ్వరు నిక్కమునకుఁ జర్చింపంగన్"

''అవిన నవ్వుచు నవ్వితొండదతవిశోడ
తనపు యద్భుతాత్మకుండ నత్యంత ధన్య
తముండ నగుదు నే నొకండన విమల చక్షి
ణాభ్యుపేత సద్భావ మమరునేని''

''నావిని వారదుండు యదునాయక నా చనుదెంచినట్టి కా
ర్యావధి సిద్ధమయ్యెఁ బ్రియమంతితిఁ జెచ్చెఱఁ బోయివచ్చెదన్''

అని గమనోన్ముఖుఁ డయ్యెను.

"అద్భుత రసమున కింత యతిశయమేమి? ధన్య శబ్దముతోపాటు అద్భుత శబ్ద
ముండుటకు కారణమేమి? కేవలాలంకారికులకు అద్భుతరసము నుత్కృష్టతద్యోతకము
కాక పోవచ్చును. వారికి శృంగారము ప్రథమారాధ్యము. కొందరికి వీరము. నవ
నాటకములు శృంగార వీరములలో నేదో ఒక రసము ప్రధానముగా నుండవలెనని వారి
మతము. భవభూతి కరుణయందు అభిమానము చూపినాడు. ఇప్పుడిప్పుడు హాస్యమును
కూడ కవులు ఆదరించు చున్నారు. కాని అద్భుతము ఎఱ్ఱయ కభిమానమనుటలో సందే
హములేదు. పై యాభ్యాయికచే వ్యాసమహర్షికి దానియందు పక్షపాతము కనిపించును.
భారతము శాంత రస ప్రధానమనియు, దానికి నాయకుడు శ్రీకృష్ణుడైనట్లును పెద్దలు
నిర్ణయించినారు.

"శివ శక్త్యాత్మకమైన శ్రీచక్ర రాజార్చనము మనదేశములో అనాదిగా నున్నది.
శ్రీచక్రరాజము నవావరణాత్మకము. అందులో అగ్రస్థానము నలంకరించునది బిందువు. ఆ
పిమ్మట త్రికోణము కలదు. తొమ్మిదవ దానికి భూపుర సంజ్ఞ. ఈ తొమ్మిది ఆవరణ
ములను తొమ్మిది చక్రములని భావన చేయుచు వానిని ఇతర భావనలతోపాటు నవరసా
త్మకభావన చేయుట గూడ గలదు. ఒక్కొక్క చక్రము, అనగా ఆవరణ ఒక్కొక్క
రసాత్మకము. అందు భూపురము శృంగార రసాత్మకము. త్రికోణము అద్భుత రసా
త్మకము; బిందువు శాంత రసాత్మకము. శాంతమునకు స్థాయి నిర్వేదము. అందుచే
శాంత రసాత్మక భావనకు పుష్కలాధికారులు సర్వసంగ పరిత్యాగము చేసిన పరమ
హంసలే. గృహస్థు అగు ఎఱ్ఱయ దానికి అవ్యవహితముగు అద్భుత రసభావము
హృదయ పద్మములో ఆరూఢము చేసికొనెనా? ధన్య శబ్దము శాంత రసోపాసనా సిద్ధుల
కా?"[71] నోరివారి అభిప్రాయమెంతైనా సహేతుకము, సముచితం.

అరణ్య పర్వ శేషంలో మార్కండేయుడు ధర్మరాజుతో ప్రళయ ప్రకారం చెప్పి ప్రళయానంతరం—

"కమనీయ జలదవర్ణుని .... .... .... ...."

"కని విస్మితుండనై యాత్మగత......"

"లోకంబులు దెగటారగ
నేకార్ణవమైన యచట నిబ్బాలు డొకం
డేకతమున నిద్రించుచు
నేకతమున నున్నవాఁడొ యెవ్వడగునో"72

అని చూచి విస్మయ మందడంలో అద్భుత రసం సముత్పన్న మవుతూంది. యక్ష ప్రశ్నలలో అద్భుత రసముంది.73

దుర్యోధనుడు ఘోష యాత్ర పేర పాండవులను అవమానింపబోయి అవమానితుడై తదవమాన దవానలంలో క్రాగినప్పుడు తండ్రి ధృతరాష్ట్రుడు పుత్రుని ఓదార్చి అర్జునుని శౌర్యపరాక్రమాలు చెప్పి అద్భుత రసంలో ముంచడం ఉదాహరించ దగ్గది.

"సిరికిఁ దొలంగి కానల వసించి కృశించిన పార్థుఁడద్ది వి
ర్జరుల వీరజనం బరమసమ్మదలీల మహాస్త్రలాభవి
స్ఫురణముఁ బొంది యద్దివికిఁబోయ శరీరముతోన క్రమ్మఱన్
ధరణికి వచ్చెఁ నిట్టివిగదా వివిధాద్భుత కర్మ పాకముల్"

"గాండీవము విల్లట యా
ఖండల నందనుఁడు విల్లుగల వాఁడట త
త్కాండంబులు దివ్యములట
యొండేటికి వాని ధనము .....యా సరియున్"74

ఇంక నృసింహ పురాణంలోని హిరణ్యకశిపుడు ప్రహ్లాదునకు పెట్టిన పరీక్షలన్నీ విఫలమై హరిభక్తి మహిమతో అద్భుత రసపరిప్లావితుల్ని చేస్తూ మరింత మహోజ్జ్వలంగా వెలిగి పోవడంలో మనం చూడగలం. ఇందుకు నృసింహపురాణమంతా ఉదాహరణమే అవుతుంది. హరి స్తంభం చీల్చుకొని ఆవిర్భవించడంలోను అద్భుత రసపోషణ ముంది.

ఇలాగ ఎఱ్ఱన ఈ అద్భుత రసానికిచ్చిన ప్రాముఖ్యం స్పష్టమవుతుంది. తన్మూలంగా అద్భుత రస పోషణలో ఎఱ్ఱన అందెవేసిన చేయి అని నిరూపించుకొన్నాడు. తద్వారా సహృదయ హృదయాలను కృష్ణుడు గోపికల హృదయాల్ని హరించినట్లు ఎఱ్ఱన ఆకట్టుకొన్నాడు.

### 3.1.5. శాంతరసం

శాంత రసం పరమోత్కృష్టమైన రసం. దీనికి స్థాయి భావం శమం. సమస్తమూ శమించినప్పుడు శాంతంగాక మరేమిటి? మహాభారతం శాంతరసంతో పరిసమాప్తమవుతుంది. ఖిల పురాణమైన హరివంశం సైతం శాంతరసంతోనే ముగుస్తుంది. ఈ విషయం విపులంగా చర్చించేముందు శాంతరసం ఎఱ్ఱన సాహిత్యంలో పరిశీలించడం అవసరం.

నృసింహావతారమెత్తి విష్ణువు హిరణ్యకశిపుని సంహరించాక కలిగిన శాంత రసాన్ని ఎఱ్ఱన మనోహరంగా చిత్రించాడు.

"శితనారసింహ ఖరా
హత దైత్య మహీవసూప ఘోరంబునఁద
ర్పితమయ్యె ననఁగఁ బరిశాం
తతఁబొందెఁ ద్రిలోకపీడ తత్క్షణమాత్రన్"75

శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో నుండగా శాంతమనంతమై ఒప్పినది.

"వేయి శిరంబులొప్పఁ బదివేలు కరంబులెలర్ప నొప్పి నా
రాయణుఁ డాద్యమైన తనయంచిత తల్పముఁ జెంది పెక్కువేల్
హాయనముల్ పరిభ్రమణమందుట నొందిన డప్పిఘూన్పఖ
ద్రాయత సుప్తిఁ గోరి కనుదమ్ముల దోయి యొకింత మోడ్చినన్"

"మును గల్పాంతమునందు విచ్చల విడిన్ మోదంబు వర్తిల్లఁగాఁ
తను బ్రాపించి చిరోప భోగ మహిమన్ ధన్యాత్ముయై విశ్వమో
హన వాఁ బ్రాజ్ఞాల చేతఁ గీర నలు వింతారంగఁ గన్నట్టి ని
ద్ర నెటిం జెందెఁ దీయ భావము సముద్యద్దివ్య యోగాకృతిన్"76

శ్రీకృష్ణుడు ఆలమందలో గోపకులతో అన్నతో అత్యంతానంద సందోహ తుందిలమైన హృదయంతో శాంత మొప్పారగా ఉండగా అక్రూరుడు చూచిన ఘట్టం.

"ఆ సమయంబునం జంద్రోదయోల్లాసంబున వికాసమానంబులైన గోవులంబేరు పేరం బిలుచు గోపాలకుల యెలుంగులను దుహ్యమానలగు ధేనువుల దుగ్ధ ధారా నివహంబుల వితాంతవినదంబుల నొండొంటిం బ్రేమ్ణుడించి సమ్ముఖంబులగు తర్గ్రీవత్స సముదయంబుల విపుల ధ్వానంబుల నొక బ్రోతగా బ్రోయుచుంబయః పయోధిం బురుడించు నందగోప ఘోషంబునకు నవిరత రత నినాద మధురంబుగాఁ జనుదెంచి యక్రూరుండు తదీయ మధ్యంబున నవంత సహితుండై యున్న యాది దేవు నాదిమూర్తి పగిదిఁ దదభిన్న భావుండగు బలదేవుండునుం దానును విలసిల్లు వాసుదేవు నంతంతం గని హర్షతరంగితంబగు నంతరంగంబును బాష్పధారా పరిప్లుతంబులగు నపాంగంబును బులక పరికలితంబగు వంగంబునై యతండు"

"ఇతఁడే విశ్వగురుండు సర్వనరదుండీశుండు నారాయణుం
డతిలోకాద్భుత భూరి విక్రముఁడు చేష్టార్థంబుగా ధాత్రికా
గతుఁడై నాఁ డితనిం బ్రమోద మెసగంగా నిల్లు గంటింగృతా
ర్థత నే నొందితి మత్సమానులిట తథ్యం బెవ్వరిందే డై అన్"77

చాణూర ముష్టికుల సంహరించి విజేతలైన పుత్రులు బలరామకృష్ణుల గాంచిన దేవకీ వసుదేవ పరిజనుల చూచినప్పటిస్థితి శాంత రసస్ఫూర్తి విస్ఫూర్తితో ఆనందాతిశాయిమై ఒప్పుతూంది. మనం సైతం ఆ సంతోషంలో భాగం పంచుకొంటాము.

"మును గన్న నాడ దవ్వేన బాబపైచిన
పట్టి గ్రమ్మఱఁ గన్న భంగిఁ గనియు
నంతక ప్రతిరూపుఁడైన చాణూరుదో
ర్బలము వితర్కించి బ్రదుకునమ్మ
కురుబాష్ప నేత్రయై యుసుఱు తల్లడిలంగ
నున్న దేవకి యెట్టు లుగ్ర భంగిఁ
బగతునిఁ బరిమార్చి బలితుఁడై తనకు మా
తెందును లేక యుక్కి తేజ
మమర వెలుగు నాకృష్ణు లోకాభిరామ
మూర్తిఁ గనుగొని వాత్సల్యముగ్ధ హృదయ
యగుచుఁ జన్నులు చేపంగ హర్షిత
లాశ్రువులు కన్ను గొనల నిండార నలరె"

"వసుదేవుండును బుత్రు మార్జిత భుజావష్టంభావనా
రసికుంబాతిత శాత్రవుం బ్రముదిత భ్రాత్రన్వితుంజూచుచున్
వెసనానంద రసానుభూతి వశనన్ సిద్ధుండపోలెన్ జరా
వ్యసనంబేమియు లేక యత్తఱిఁ గుమారాకారుఁ డయ్యెన్ మదిన్"

"కంసుని కొల్చువారయిన కామినులెల్లను గృష్ణమూర్తి యా
శంసదలిర్ప జెప్పలిడఁ జాలక చూడ్కులు గొల్చుచున్ సభన్
గంసుని యున్కియున్ బహుముఖంబుల మల్లుల వోరుఁ దద్రిపు
ధ్వంసము లోనుగా నొక విధంబు నెఱుంగ రత్నమ్మెఱుంగమిన్"[78]

ఈ విధంగా శాంతరస మత్యంత మనోజ్ఞంగా చిత్రితం. ఇదే రీతిని శ్రీకృష్ణ జనన సమయంలోను వసుదేవుడెరిగి హర్షామోదం పొందడంలో శాంతరసం వర్ణితం.

"నెఱులై యొప్పు వినీల కేశములునున్నిద్రాన నాబ్జంబునే
త్రఅ నూత్నాంబుద తుల్యకాంతియును నై దివ్య ప్రభావంబునం
గఱయన్ మ్రాగును లేక పుట్టిన శుభాంగం బద్భుతాపాదియై
నెఱయం గన్నులు విచ్చిచూచు తనయున్ వీక్షించి మోదంబునన్"[79]

—ఇలాగా హరివంశంలో శాంతరసముప్పతిల్ల జేసిన ఎఱ్ఱన ప్రతిభ అమోఘం.

ఇలాగే నృసింహ పురాణంలో హిరణ్యకశిపుని సంహరించాక భగవంతుని ఉగ్రస్వరూపాన్ని ఉపసంహరించవలసిందని బ్రహ్మ స్తుతించగా శాంతం పొందడంలో శాంతరసం పోషితం. "అని ఇట్లు భారతీ వల్లభుండు సల్లాప రూపంబుగా నభిరూపారసంస్తవంబు గావించినఁ గారుణ్య తరంగితాంతరంగుఁడై దేవతాసింహుండగు లక్ష్మీ నరసింహుం డప్పితామహుఁడెన మధుర స్మిత వికాస భాసురంబుగా నాలోకించి యిట్లనియె"[80] ఇందులో అహోబల మాహాత్మ్యన్ని వివరించి దానికి విశిష్టతను చేకూర్చడం జరిగింది.

ఇలాగా నవరసాలను సహృదయావర్జకంగా పరిపోషించిన ప్రతిభా సంపన్నుడు ఎఱ్ఱన.

## 3.1.10 రస సంకరం

అనేక రసాలను ఒకేచోట వర్ణించడం రస సంకరం. లాక్షణికుల మతం ప్రకారం ఇది దోషమే. కానీ సందర్భోచితంగా ఆయా రసాలు సమ్మిళితమైనట్లు కవులు వర్ణించి అనౌచిత్యం పాలుగాక ఔచితీసహం చేయడం మెచ్చదగ్గ విషయం. అలాంటి సందర్భాలు ఎఱ్ఱనలో మనం చూడగలం. కొన్ని ఉదాహరణలు :

### వీరరౌద్ర భయానక విస్మయ రసాలు :

నృసింహస్వామి అవతరించి హిరణ్యకశిపుని సంహరించినపుడు ఆ స్వామి స్వరూపాన్ని చూసి భయకంపితులై భక్తి ప్రపత్తులతో ప్రహ్లాదుడు, మునులు, దేవతలు స్తుతిస్తారు. ఆ సందర్భంలోని ఎఱ్ఱన రచన:

"అని బహు భంగులన్నమని పురావలి తన్వి నుతించు వాఙ్మయ
ధ్వనులు నభోదిగంత మిళితంబులుగా మదవేగ విస్ఫుర
ద్ఘన దితిసూను కుంజరవిదారణ దారుణ కేలవంబు నం
దన నరసింహ లీల వినుతస్థితి సార్థకమై తనర్పగన్"

"వీర రౌద్ర భయానక విస్మయాఖ్య
రసము లనుబోధ్య భంగుల నెనక మెసఁగ
నఖిల భువన హృద్యంబుగ నవ్విభుండు
నిపుణ వక్రతా నటనంబు నిర్వహించు"

"తదనంతరంబ యయ్యు
న్మదఘోర విజృంభణంబు మాని వికాసం
బొదవఁగ ........

"సితకమల దళంబులకున్
బ్రతియగు లోచనంబులందుఁ బ్రభలు ప్రసాద
స్మిత రుచిజాలములు దిశా
ప్రతతిన్ బూర్ణేందు రుచుల భంగి వెలుంగన్"81

ఎ=8)

## శృంగార వీర రసాలు :

శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి సౌందర్య వైభవాన్ని విని ఆమెను తన దానినిగా జేసుకో యత్నించే సమయంలో అతని హృదయంలో కలిగిన భావాల రూప కల్పన ఎఱ్ఱన అత్యంత మనోహరంగా చేయడంలో శృంగార వీర రసాలకు అవకాశం కలిగింది.

> "ఎమ్మెయిఁ జూతునొక్కొ తరళేక్షణ నక్కట చూచి యెమ్మెయిం
> గ్రమ్మన నిర్వహింతునొకొ కైకొను కర్జము వేడి శత్రు సం
> ఘమ్ముల నెమ్మెయిం దొడరి గర్వము సొంపడగింతు నొక్కొ యే
> నెమ్మెయి నిశ్చయింతునొకొ యింతి దెనమ్మను విన్నచందముల్"

> "నన్ను బొడగన్నచోట నన్నలిననయన
> చూపు చూపులఁ బ్రేమంబు సొంపు గదిన
> యపుడ తలియంగ నుఱుకుదు నమరు లడ్డ
> పడినఁ బట్టుదు నాపాణి పంకజమున"

> "కమలాస్య నెమ్మోము కమ్మని తావికి
> దందడిఁ దమకించు తరళితయును
> ముద్దియ యెల దొక్కు ముద్దారుఁ బలుకులు
> వినఁగ నుత్తల పడు వేడుకయును
> పూఁబోఁడి నెమ్మేనిఁ బొంది యానందంబు
> గడగాన బూనెడు కౌతుకంబు
> కామిని కొండంత కడలొత్తు కోర్కులు
> నిండింపఁ గాంక్షించు నెఱగడకయు
> భామయును నేను నన్యోన్య భావమగ్ను
> లగుట యెఱిగిన యాప్తజనాళి ప్రియము
> నిర్వహింపంగఁ గలుగుట నిక్కమునకు
> నరయ నేభంగి భాగధేయంబొ నాకు"[32]

## రౌద్ర భయానకాద్భుత రసాలు

గరుత్మంతుడు బాణాసురుని సైన్యాన్ని ఎదుర్కొని సంహరించిన తీరు వర్ణితం.

"తెక్కల నడచియు నఖిముఖి
ముక్కునఁ బొడిచియును నఖరములఁ జీరియు నే
దిక్కు హరి సూచె దానా
దిక్కు రిపులనెల్ల వైనతేయుఁడు నుఱిపెన్"
"గరుడఁడు బాణానీకము
బొరి గొనియెడు జాడ జముని పోయెడు క్రీడా
సరణి కరణి శవమయమై
యురు రౌద్ర భయానకాద్భుతోద్ధతిఁ బెంచెన్"[83]

భయానక రౌద్ర వీరరసాలు :

వామనుడు బలిని పాదత్రయమడిగి విరాట్స్వరూపం ధరించిన సందర్భంలోని ఎఱ్రన రచన.

"బలి యాశ్చర్యము నొంది సంభ్రమ భయభ్రాంతత్వ సమ్మోహనా
కులభావంబునఁ జూచుచుండె నసురల్ క్రోధోద్ధతిన్ వేల సం
ఖ్యలు దీప్తి స్ఫుర దస్త్రశస్త్ర విటపిగ్రావోల్లసత్పాణులై
పెలుచం జుట్టును ముట్టి రవ్విభు మహాభీమాభిరామాకృతిన్"
"పదములు జాను లూరువులు బాహువు లంటగఁ బట్టి యెందుమన్
గదలక యుండ నొత్తుఁడని క్రమ్మిన యాబలవద్విరోధులం
బదములు జంఘలూరువులు దాహువు లోలినమర్చి త్రొక్కియున్
విదిలిచియు న్నొగిల్చియును వ్రేసియుఁ ద్రుంచె నతండు వ్రేల్మిడిన్"[84]

వీరాభాసహాస్యరసాలు :

హాస్యరస వివరణలోను, వీరాభాసోదాహరణలోను, పూర్వోక్తమైనట్లు శిశుపాలుడు శ్రీకృష్ణు నెదిర్చి, రుక్మిణిని గ్రహించ ప్రయత్నించిన సందర్భంలో వీరాభాస హాస్య రసాలు ప్రస్ఫుటం.[85] ఇలాగా సమరసాలు, తదాభాసాలు, రససంకరమూ ఎఱ్రన కృతులలో మనం గుర్తించ గలం.

## 3.2 భక్తి :

నవరసాలతో పాటు భక్తిని సైతం రసంగానే లాక్షణికులు అంగీకరించిన విషయ చర్చ రెండో ప్రకరణంలో చేయడం జరిగింది. నృసింహపురాణ హరి వంశాలలో

ప్రసంగా పరిపూర్ణంగా పరిపోషింపబడి ఉండడం గమనించదగ్గ విషయమని చెప్పడం కంటే ఆకృతులు రెండూ భక్తి ప్రతిపాదనకే ఉద్దిష్టమయ్యాయని చెప్పడం సముంజసం. నృసింహపురాణంలో నరసింహస్వామి భక్తితత్వమూ, హరివంశంలో శ్రీ విష్ణువే హరిగా భువిపై అవతరించి ద్వారకా నామక వైకుంఠంలో సుధర్మ అనే పేరుగల సభా భవనంలో వెలసిన విషయ వివరణా ఉద్దిష్టాంశాలు గనుక భక్తి ప్రాధాన్యమూ ప్రాబల్యమూ విస్పష్టం. భాగవతభక్తి తత్వం ఇందులో పరిపుష్టి చెంది ఉండడం మరో విశేషం. నవవిధ భక్తులెలా పరిపోషింప బడ్డాయో తద్ద్వారా ఎఱ్ఱన భక్తితత్వమెలాంటిదో క్రమంగా పరిశీలిద్దాం.

### 3.2.1 ఎఱ్ఱన భక్తి రసం :

ఎఱ్ఱన భక్తిని రసంగానే తనకృతులలో చిత్రించడం పై భావాలను స్థాపిస్తుంది. నారదుడు మహతి మీటుతూ శ్రీ కృష్ణ గానం చేసుకొంటూ ద్వారకకు వేంచేసిన సందర్భం.

"అన్నిటి యాభోగంబుల
నన్నీరజనాభు శ్రుతి సమారాధ్య యశున్
వెన్నిధిఁ బడసెన వడువునఁ
జెన్నొందఁగఁ బాడె జనుల చిత్తములలరన్"[86]

"పిదపఁ జేతి దండియ యటు వెట్టి కేలు
మొగిచి భక్తి రసం బాత్మముంచికొనంగ
నఖిల వేదాంత విద్యా రహస్య భావుఁ
గోరి కీర్తించెఁ బ్రభువు నన్నారదుండు"[87]

— నారదుని ఆత్మలో భక్తిరసం ముంచుకొన్నదని ఎఱ్ఱన వర్ణించాడు. ఇలాగే అహోబలక్షేత్ర మహిమను నృసింహ పురాణాంతంలో చెప్పినప్పుడు

"అని రోమహర్షణుడుఁ వినిపించుటయు సంయమి ప్రవరులు భక్తి రసావేశంబున నానందామృత ధారల మునిఁగి యహోబలనాథు నిచ్చట దలంచుచు యథేచ్ఛం జనిరి"[88] అని ముగించడంలో ఎఱ్ఱన భక్తిని రసంగా పరిగణించినట్లు స్పష్టం. అక్కడ చేరిన సంయమివరులు "భక్తి రసావేశంబున నానందామృత ధారల మునిగి" పోయారట. ఇది ఎఱ్ఱన తన కృతులలో రసావిష్కరణ గావించ యత్నించిన తీరు

వైకుంఠపుర వర్ణనా సందర్భంలో విష్ణునామ సంకీర్తనం ఒకే పద్యంలో నవవిధ భక్తి రీతుల్ని ఎఱ్ఱన సూచించడం గుర్తించదగ్గ అంశం.

"నారాయణుని దివ్యనామ సంకీర్తనం
బనిశంబుఁ జేయు మహాత్ములకును
పద్మాక్షు శ్రీపాద పద్మంబు లత్యంత
భక్తిమైఁ బూజించు ప్రాజ్ఞులకును
లక్ష్మీశ్వరుని సముల్లా సహేతువులగు
వ్రతములు సల్పు సద్వర్తనులకు
విశ్వరూపుని మూర్తి విభవంబు నేకాగ్ర
బుద్ధి భావించు సత్పురుషులకును

భవము దీఱిన తుదివచ్చి భవ్య సుఖము
లనుభవింపంగఁ దగు నెలవగుటఁ జేసి
యఖిల వస్తు సంపదలకు నాకరంబు
గుణవిధా విభాసురము వైకుంఠపురము"[89]

— ఇంతే గాకుండ నవవిధ భక్తి రీతులకు క్రమంగా ఉదాహరణలివ్వడం ఎఱ్ఱన పోషించిన భక్తిరస పరిపుష్టికి మన మనస్సంతుష్టికి హేతువు. దీనికి కారణం హరి సర్వోత్తముడు. హరి స్మరణం సర్వదుఃఖ నివారకం. మోక్షదాయకం అని ప్రహ్లాదుడు దానవ బాలురకు" అనిలునిచేఁ గాల దర్కునిచే గ్రాగ"[90]దనీ చేసిన హితోపదేశం వల్ల వ్యక్తమవుతుంది. హరిభక్తి మహిమ హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని హర్మ్యతలంమంచి పడదోయించగా చెక్కుచెదరక బ్రతికినప్పుడు తెలుస్తుంది. అది మంత్రబలంగాదన్నీ,

"విష్ణుపరాయణత్వం బెట్టిదనీవ"—

"ఒరులకుఁ గీడు దలంపరు
హరిభక్తికి రావ మొరుల నాత్మ సమముగాఁ
బరికించు వారి నాపద
పొరయునె కారణము లేక పొందునె భయముల్"[91]

అని వివరిస్తాడు. ఇది ఈనాడు మనం చాలా గొప్పగా భావించే మానవ వాదంతోగాని, నవ్యమానవవాదంతోగాని తీసిపోదనిపిస్తుంది. పైపెచ్చు ఇలాంటి సద్భావం సర్వమానవ సౌభ్రాత్రం, అంతకంటే సర్వమానవ కోటి సమానంగా చూడగలిగే అర్హతను సంపాదించుకోవడం అవసరమని ఏనాడో చెప్పినట్లు స్పష్టమవుతుంది.

ఇక నవవిధ భక్తి రీతులను పరిశీలిద్దాం. నవవిధ భక్తులలో కీర్తనం మొదటిది.

### 3.2.2 కీర్తనం :

నామ కీర్తన మహత్వాన్ని ప్రహ్లాదుడిలా వివరించాడు.

"దారుణ దురితాంధకార సూర్యోదయం
బధిక పాతక విపినానలంబు,
నిబిడ కల్మషమేఘ నిర్భర పవనంబు
బాడపాపాంబుధి బాడబంబు
క్రూరకిల్బిష శైలకులిశనిపాతంబు
ఘనకలుషోరగ గరుడమూర్తి
ఘోర దుష్కృత కాలకూట గంగామౌళి
యతులాఘ హరిణ పంచాననంబు
సకల కళ్యాణ మూలంబు సకలవేద
శాస్త్ర సారంబు సకలార్థ సంచయంబు
సకల మంత్ర రహస్యంబు సాధు హృదయ
నర్తనము విష్ణునామ సంకీర్తనంబు"[92]

రూపకాలంకారంలో సాగిన ఈ సీస పద్యం మనోహరం — నారాయణ నామ సంకీర్తనా వైశిష్ట్య మీ పద్యంలో సహృదయరంజకంగా సాగింది. విష్ణునామ సంకీర్తనం పాపపు చీకటికి సూర్యోదయమని, పాతకములనే అడవికి దావాగ్ని అని, కల్మషములనే మేఘాలకు ప్రభంజనమని, పాపమనే సముద్రానికి బడబాగ్ని అని, క్రూరమైన పాపమనే కొండలకు వజ్రాఘాతమని ఘనకలుషములనే పాములకు గరుడుడని, దుష్కృతాలనే కాలకూటానికి శివుడని, అఘములనే హరిణాలకు హర్యక్షమని, సకల కళ్యాణ మూలమని ప్రహ్లాదుని చేత పలికించడం అత్యంత సమర్థవంతంగా ఉన్నది. సాధుహృదయాలలో నర్తించేదే విష్ణునామ సంకీర్తనమని పద్యాన్ని ముగించడం పరమ రమణీయంగా ఉన్నది.

శ్రీ మహావిష్ణువే తన్నామోచ్చారణా పై శిష్ట్యాన్ని స్పష్టం చేశాడు.

"ఏనెవ్వాడనొ నాచరిత్రము తెలంగెళ్ళంగియో తన్మయ

ధ్యానం బెట్టిదియో యెఱుంగని విమూఢాత్ముండు మన్నామమె

ట్లయినం బేర్కొనఁ గాంచునేని దురితోదగ్రాంతకారచ్ఛటా

భానుండీతఁ డన. గ భవ్య పదముం బ్రాపించువాఁడున్ మ న్''93

ఉదంకుడను మహర్షి విష్ణువు ప్రత్యక్షమైనప్పుడు చేసిన కీర్తనం.

"దేవదేవ శ్రుతి ప్రమాణ విధేయ మాధవ జంగమ

స్థావరాత్మకమైన లోకము సర్వమున్ భవదీయ మా

యావిధేయము విశ్వరూపుడ వవ్యయుండవుసీవ స

ద్భావ సుస్థితి నిన్నెఱింగినఁ బాయుఁ బాపము-అచ్యుతా''94

అక్రూరుని హరి సంకీర్తనం :

''జయ సర్వాత్మక సర్వభూత విభూతా సంభావ్య సర్వజ్ఞ స

ర్వయుగోత్పత్తి సమాప్తి కర్మకలనా వర్ధిష్ణు విద్యావిని

శ్చయ ధౌరేయ సమస్త విస్మయ విధా సంధాయక ప్రక్రియా

నయనిష్ఠావనతార్తి నోదన ధురీణవ్యాప్తి రంజత్కృపా''95

— ఇలా ఎన్నెన్నో ఉదాహరణలివ్వవచ్చు.

## 3.2.3 అర్చనం :

కీర్తనం తర్వాత అర్చనం ప్రాధాన్యం వహిస్తుంది.

దేవతలు వి వును సందర్శించి అర్చించడం—

''శ్వేత ద్వీ ాయ సంసార తిమిరశ్వేతభానవే

నమః కైవల్య కంఠాయ వైకుంఠననరాయచ''96

ప్రహ్లాదులు నృసింహమూర్తిని అర్చించడం

''శ్రీనాధనాధా జగన్నాధ నమైశ్రిక రక్షసమక్ష సరోజాక్ష

మమ్మేప్పు రక్షించు లక్ష్మీశ యీశా నృసింహా నమస్తే నమస్తే నమః''97

ఇంద్రుడు శ్రీ కృష్ణున కొనరించిన అర్చనం పేర్కొనదగ్గది.

''అంతయు ననుసంధించి గోవులు గోపాలరక్షణగమింప వచ్చి నిజ పయోధరం బుల దొరగు పయః పూరంబుల నతని శిరంబభిషేకించె .... విట్లు కృష్ణాభిషేకంబు సర్వశుభావహంబయి పరగిన యనంతరంబ''

"దివ్యాంబర భూషామల
నవ్యాంబుగ నపుడు కమలనాభుని కింద్రుం
డవ్యాహతముగఁ జేసెను
భవ్య పరిష్కారమధిక భద్రంబమరన్"[98]

## 3.2.4 శ్రవణం :

హరివంశ శ్రవణ ప్రాశస్త్యాన్ని జనమేజయునకు వైశంపాయనుడు వివరించిన విధం.

"విను హరివంశ నామమున విశ్రుతమైన పురాణమగ్రిమం
బనుపమ వాగ్విశేషవిభవాఢ్యుడు సత్యవతీ సుతుండు చె
ప్పిన యది యేనునీకు వినిపించెదఁ బూజ్యతమంబు వంశవ
ర్ధనము సమస్త పుణ్య ఫలదం బిది శ్రోతకు వక్తకున్ నృపా"
"భాసిత శుద్ధి యుక్తుడవు భవ్యయశుండవు నై వనీవ యు
ద్భాసిత బుద్ధియుక్తమును భవ్యయశంబునునైన యాదవో
ల్లాస చరిత్రమున్ వినఁదలంపఁగ నర్హుఁడ విద్ధ వైభవ
శ్రీ సుఖసుస్థిరాయువులఁ జెందఁగఁ బాత్రమవై తనర్చుటన్"[99]

## 3.2.5 పాదసేవనం :

అక్రూరుడు శ్రీకృష్ణుని పాదసేవనం చేయడం :

"శ్రుతిసీమంత పదంబులం బ్రకటమై సుస్నిగ్ధ సిందూర సాం
ద్రత రంజిల్లెడు వాసుదేవు చరణద్వంద్వంబు గోష్ఠస్థలీ
గతులన్నూతన గోమయంబుల ననర్ఘశ్రీ దలిర్చె న్మహో
ద్భుత మీ యొప్పిదమంచు భక్తి వినయ స్ఫూర్జత్సమస్తాంగుడై"[100]

హరిపాదసేవనం వల్ల ఎలాంటి పాపాలు అంటవని ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని తో చెప్పడం.

"భయముల నెల్ల బాపుటకుఁ జాల్పది నాఁడు పయోరుహాక్షుఁడ
క్షయుఁడచలుం డనంతుఁ డనిశంబును నామదిలోన నుండగా
భయ మొక టెందునుంగలదె పంకరుహోదరపాదపంకజా
శ్రయులకుఁ దండ్రి పుట్టవు జరామరణాది భయంబు లేమియున్"[101]

హరిపాదసేవనం వల్ల కలిగే ఫలితమనంతమని విస్పష్టం.

### 3.3.6 వందనం ;

నారదుడు శ్రీ కృష్ణునికి నమస్కరించడం.

"అద్యుఁడవాదిదేవుఁడ వనంతుఁడ వుత్తమ యాపబోధ రూపతా
హృద్యుఁడ వుద్యతాఖిల సహేతుక సృష్టి విధాయి వుద్భవ
చ్ఛేద్యనవద్య వీర్యుఁడవు సిద్ధుఁడ వీవు భవన్నమస్క్రియా
స్వాద్యసుధారసంబెపుడుఁ జాలఁగఁ గల్గెడు మాకునచ్యుతా"[102].

ఇలాగే గోపవృద్ధులు శ్రీ కృష్ణుని గొప్పదనాల్ని ప్రస్తుతిస్తూ మ్రొక్కడం :

"ఆలం గాచెద వక్కట
త్రైలోక్యముఁ బేర్మిఁగావఁదగు ఱేఁడవు నీ
మూల మెఱుంగమి వెఱఁగడుఁ
దూలెద మిట్లేమి తప్పు దొడరునొ యనుచున్"

"నందగోపుని యన్వయానందకరుఁడు
సుదతియో యశోదకు ముద్దు సూపుపట్టి
క్రీడ సలిపెడునదె చిన్ని కృష్ణుఁడనుచు
మనుజుఁగా నిన్నుఁగను తప్పు మాకు పెప్ప"

"నీవెవ్వడవైన నగుము
భావంబున నీకు మ్రొక్కి ప్రతికెదము మమున్
గావుము ప్రోవుము గొల్లల
మేవిధిఁ బేరు కొమవార మెఱుఁగ మొకటియున్"[103].

— అని ఎంతో హృద్యంగా ఎర్రన వర్ణించాడు. నారద వందనం జ్ఞానయుతుని వందనం. గోపవృద్ధుల మొక్కు మూఢభక్తికి నిదర్శనం.

### 3.3.7 స్మరణం ;

హరి స్మరణమే ముఖ్యం. తన్మూలంగా ప్రహ్లాదునకు హిరణ్యకశిపుడు పెట్టిన బాధలన్నీ పటాపంచలై బాధించవు. అగ్నిలో పడవేసినా, హర్మ్యాగ్రం నుంచి త్రోయించినా చలించని ప్రహ్లాదుని మాటల్లో ఈ విషయం స్పష్టం.

"శౌరిపదాంబుజస్మృతి రసంబునఁ దేలెడు నామనంబు తం
డ్రీ రుచింపంప దన్యముఁ గడింది గనీహెనరిం్చినట్టి యి
ద్దారుణ వహ్నియున్ విసము తామరసాకరమయ్యె నాకుఁబ్ర
స్ఫారిత పీచు లీశిఖలు చల్లని తుష్పర విస్ఫులింగముల్"104

"ఇంతయుఁ జూచి నిక్కముగ నేను వచింత్యుననంతు నచ్యుతుం
జింతన సేయుదున్ సకల జీవుల యందును గాంతు నవ్విభున్
భ్రాంతి యొకింత లేదు మదిఁ బండిన భక్తియు నొందు దిక్కు వో
దెంతటి పేర్మియైన నగునిట్టి తెఱంగున దైత్య పుంగవా!"105

## 3.2.8 దాస్యం :

దాస్యభక్తికి సైతం అత్యంత ప్రాధాన్యముంది. వైష్ణవ భక్తితత్వంలో 'దాస దాసదాసానుదాసః' అనే సూక్తి ఉండనే ఉంది. శ్రీకృష్ణునకు గోప గోపీ జనం దాసులు. వారిది దాస్యభక్తి. కుబ్జ భక్తురాలు కావడం చేతనే శ్రీ కృష్ణుని అనుగ్రహంతో సురూప కాగలిగింది. ఇలా ఎన్నేని ఉదాహరణలివ్వవచ్చు.

దేవతలు నారాయణుని ప్రస్తుతించడంలో ఈదాస్యభక్తి సైతం మనకు స్పష్టంగా తెలుస్తుంది.

"దాస్యమొకండునుం బరమ ధర్మముగాఁ గొని యన్య ధర్మ మా
శాస్యముగా గణింపకయ సంశయ విశ్చల భక్తి సంత తో
పాస్యుననేష భవ్య పురుషార్థ భవైక విధాయి నిన్ననా
లస్యతఁ బొంచ రాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా!"106

## 3.2.9 సఖ్యం ;

నరనారాయణులలో నారాయణునిపై నరునకు గల భక్తి సఖ్య భక్తి. తన్మూలంగానే నరుడు విజయుడైనట్లు సర్వవిద్వల్లోక విదితమే. అదే రీతిగా శ్రీ కృష్ణునిపై అక్రూరునకు సఖ్యభక్తి విస్పష్టం.107 ఇంతేగాదు ఈ విషయం అక్రూరుడు వాచ్యం చేశాడు. శ్రీ కృష్ణుని దర్శించి అక్రూరుడు భావించిన తీరు;

"అయ్యో శ్రీ కృష్ణ యిందు రమ్మనుచుఁబోయి
కౌఁగిలింతునో యటుగాక కమలనాభ
యాది పురుష యచ్యుత యని ప్రణామ
మాచరింతునో రెండు కృత్యములు నాకు"108

ఇంతేగాక ఈసఖ్యం శ్యమంతకమణి అక్రూరుని వద్ద ఉండగా కృష్ణునకు గలిగిన అపవాదును అపనయింప జేసుకోడానికి అక్రూరుని రప్పించి ఆ రత్నాన్ని బయట పెట్టించి తరువాత దాన్ని ధరింప అతడే అర్హుడన్న విషయాన్ని తెలిపి అతని సఖ్యాన్ని నిరూపించాడు.[109]

## 3.3.10 ఆత్మనివేదనం

హరి సర్వోత్తముడు. సర్వమూ భగవత్పరంచేసి ఆత్మనివేదనం గావించడం వైష్ణవ భక్తితత్వంలోని ముఖ్యాంశం. ఈ ఆత్మనివేదనం సర్వభక్తకోటిలో నృసింహ పురాణంలో అంతకంటే హరివంశంలో చూడగలం. రుక్మిణీ గోపికలు ఆత్మనివేదనైక భక్తితత్పరలని స్పష్టమవుతుంది.

బ్రహ్మ ఆత్మ నివేదనైకపరుడై నరసింహస్వామిని ధ్యానించిన విధం:

"నేరనివార మేమిటికి నిక్కము నీ గుణరూపచింతకు
న్నేరము పెద్దయున్నియము నిష్ఠయు భక్తియుఁబూని పల్కఁగా
నేరము మమ్ము నివ్విధము నేరమి చూడక యాశ్రితైక ర
క్షౌరత బుద్ధివై కరుణ గావు మహోబల తీర్థ నాయకా"[110]

ఇంతేగాక నరసింహ స్వామియే ప్రహ్లాదుని ఆత్మనివేదనైక భక్తిని అంటే ప్రపత్తిని ప్రస్తుతించడం ఉదాహరించదగ్గ అంశం.

"మెచ్చితి నిను నీ కీ పొం
పొచ్చెపుఁ బలుకేల యింక బుధపూజిత! నీ
సచ్చరిత మింతట నచ్చుపు
టచ్చు మదీయ ప్రపత్తి కలిలము వందున్"[111]

"దైతేయ రాజ్య విభవ
ఖ్యాతియొనఁగ నీవు పెద్దం తము భవత్
గాతిశయ మనాపత్తుఁడ
వై తగ భజియించి పొందు మన్మత్ప్రదమున్"[112]

ఇలాగా నవవిధ భక్తిరీతులు ఎఱ్ఱన కృతులలో స్పష్టంగా చూడగలం.

### 3.3 భక్తి ఆరు విధాలు :

ఇది ఇలాఉండగా భక్తి ఆరు విధాలనీ, అవి శాంతం, దాస్యం.*ప్రీతి,సఖ్యం, వాత్సల్యం, మాధుర్యం అనీ రూపగోస్వామి మతమన్న విషయం రెండో ప్రకరణం లోనే పూర్వోక్తం. ఈ ఆరింటిలోను నవవిధ భక్తి రీతులలో దాస్యం, సఖ్యం, అనె వాటికి ఉదాహరణలతో వివరణ ఇవ్వడం జరిగింది. శాంతం రసమన్న విషయం నవ రస ప్రస్థానంలో స్పష్టం చేయడం జరిగింది ఇక మిగిలినవి రెండు. ఒకటి వాత్సల్యం రెండు మాధుర్యం. వీటిని క్రమంగా సమీక్షిద్దాం.

### 3.3.1 వాత్సల్యం :

"భరతుడు హాస్య శృంగార మోస్స్వరితోదాత్తైః, వీర రౌద్రాద్భుతేషు ఉదాత్త కంపితైః, కరుణ వాత్సల్య భయానకేషు అనుదాత్త స్వరిత కంపితైః పద్యైః పాఠ్య ముపపాదయతి"అని యాయా రసము లందు వర్ణముల నెట్లుచ్చరింప వలయునో చెప్పుచు వాత్సల్యమును పేర్కొనెను. దీని నెనిమిది రసములలో జెప్పలేదు. ఇటనే యీ పదము ను వాడెను. దీనిని జూచియే సాహిత్య దర్పణకారుడు 'అథమునీంద్ర సమ్మతో వత్స లో రసః' అని యారంభించి(చెప్పుటచే) మిక్కిలి చమత్కారముగా నుంటబట్టి వత్సల మును గూడ రసముగాం ఎంచితిమి. దీని స్థాయి ప్రేమయుక్తమగు రతి. దీనికిం బుత్ర భ్రాత్రాదులాలంబనము. వారి చేష్టలును, విద్యా శౌర్యోదయాదులును నుద్దీపనములు. ఆలిం గనము, గాత్ర సంస్పర్శము, శిరశ్చుంబనము, ఈక్షణము, పులకలు, ఆనంద బాష్ప ములు మొదలగునవి యను భావములు. అనిష్టశంక, హర్షము, గర్వము మొదలగునవి వ్యభిచారి భావములు."[113]

పుత్రవాత్సల్యానికి చక్కటి ఉదాహరణలు బాల గోపాలుని చేష్టలు. యశోదా నందుల పుత్రవాత్సల్యం పూతన సంహారానంతరం బాలకృష్ణుని గాంచినప్పుడు స్పష్ట మవుతుంది.

"అకట నేం జెల్ల నేజెల్ల హాకుమార
హా తనూభవ హా వత్స యనుచు నార్తిం
దల్లియును దండ్రియును వచ్చి తనుజుం బొదివి
రమ్ముగేక్షణ బాష్పాకులాక్షి యగుచు"

"బాలుని గ్రుచ్చి యెత్తి యురంబున నదిమి కొనిన నందుండు నయ్యిందువదన నిదియేమి ఈరక్కసి యెక్కడినుండి వచ్చె నిచ్చిఋతవాని నీ చందంబు సేయుట యెల్ల నీ వేల యేమటి తనిన నయ్యబల యూతని తోడ"

"కడుపు నిండంగఁ జన్నిచ్చి కొమరుకు నిద్ర
చోవ దీవియ మండంగఁ బ్రొద్దువోవు
నంతదాక మేల్కొని యుండి యలసి కన్ను
కింత మూసితి నాలస్యమేది యుందు"114

బాలకృష్ణుపైగల ఆ తలిదండ్రుల వాత్సల్య మెంతటిదో స్పష్టం. ఇంతకంటే మరింత మనోహరమూ, స్వాభావికమూ అయిన వాత్సల్యం యశోదలో చూడగలం. బాలకృష్ణుడు చేసే వలుగాకి పనులకు వేసారి గోపికలు యశోదతో మొరపెట్టుకోగా వారి నేదో సర్ది చెప్పి పంపిన యశోద పుత్రునిపై చూపిన వాత్సల్యం అమోఘం. అనన్య సామాన్యం.

"భువన క్లేశములెల్ల మాన్ప శిశుతా స్ఫూర్తిం బ్రవర్తిల్లుచున్
వివిధ క్రీడలఁ బ్రోడయైన ప్రభువున్ విష్ణుం బ్రవర్తిష్ణు నా
నవనీతామృత చోరుఁ జూచి యెలమిన్ రాజాస్య యాత్మీయవం
శవతా బుద్ధిఁ బ్రవృద్ధమైన మమతా బంధంబు సంధిల్లగన్"

"ఏలా యిందును నందుఁ బాపెదవు నీకే బ్రాంతియే వెన్నలుం
బాలుం బాలక చాలఁజేఁ పె విదె నా పాలిండ్లు పెన్ పోనలై
పాలొక్కమ్మడిఁ గ్రమ్ము చున్నయవి నీ భావంబునం దృప్తిగాఁ
గ్రోలం జాలవె యింతవట్టకట యీ గోపేల చుట్టాలలోన"

"తల్లి చనుఁ బాలు గ్రుక్కెడు తక్కువ యవి
పుట్టుడును నొక్క రూపవ భూమి బరఁగు
నాడువు నొంకయ్యెఁ జన్నిత్తుఁ దొడల మీద
గుండె వట్టి యుంచుక వచ్చునంత వమ్మ"

"అని యెతుకొని యూరంబున
దనియఁగ వదిమికొని చన్నుఁ దన్మ్రా
ఘనదుగ్ధ పిచ్చలంబుగ
మనమలరఁగ నిచ్చుటయుఁ గుమారుఁడు ప్రీతి

"మును జననీ స్తనంబులకు మోపగ వ్రేగయి యున్న యట్టి య
వ్వినుత పయస్సులన్నియును వేడుకతోఁ గడుపార నారగిం
చినఁ బ్రియమంది నందసతి చెక్కులు నక్కును మస్తకంబు మూ
ర్కొనుచు ముద్దులాడి మఱి కొంకొక సేపునకుం బ్రియంబునన్"[115]

—ఈ దృశ్యమెంతో మనోజ్ఞం. మన కన్నులకు కట్టినట్లు సాక్షాత్కారమై రసానందాబ్ధిలో ఓలలాడిస్తూంది. ఆతల్లి బిడ్డపై ఎంత మమకారమూ, వాత్సల్యమూ కనపరచిందో సుస్పష్టమవుతూంది. ఇది పెంచిన ప్రేమ ఆ విషయం యశోద ఎరుగదు. కాని కన్న ప్రేమ దేవకీదేవిది. దేవకీ వసుదేవుల వాత్సల్యం సైతం ఉదాహరింపదగ్గదే.

కంస సంహారానంతరం—

"అప్పు డప్పుణ్య పురుషుల మీదం ద్రిదశకర విముక్తంబగు కుసుమ వర్షంబు గురిసె, దివంబున దేవ దుందుభులు మొరసె మునుల యాశీర్వాదనినాదంబులును, సిద్ధుల జయవచోనినాదంబులునుం బెరసి మేదురంబులై వీతెంచెఁ బ్రత్యర్థి భంజన పారీణుండైన యాపద్మనాభుండు గ్రక్కనంజనుదెంచి కంస దళన కఠోరంబులగు కరంబులఁ దండ్రి చరణ గ్రహణంబొనర్చిన నతండు గాఢంబుగాఁ గౌగిలించి దీవించెఁ దల్లికి మ్రొక్కిన నుద్గత నవక్షీర మసృణ స్తనంబగు నురంబునఁ గొడుకుంగడు బిగియం గదియించి శిరంబు మూర్కొనియె"[116]

—ఇలాగా ఈ మాతాపితల వాత్సల్యం రసంగానే సహృదయ హృదయాలలో రసించి ఆనంద సందోహాన్నందిస్తుంది.

### 3.3.2 మధుర భక్తి :

ఇంతకు ముందే రెండో ప్రకరణంలో భక్తి, మధుర భక్తులను గూర్చి వివరించిన సందర్భంలో మధురభక్తి ప్రాధాన్యం గుర్తించడం జరిగింది. అయితే ఎస్. కే. దే పండితుడు వివరించిన మరికొన్ని అంశాలు మధురభక్తిని గూర్చి తెలుసుకోవడం అవసరమని భావిస్తున్నాను.

"The Krishnarati (Love of Krishna) forms 'Sthayibhava' of this 'rasa' and the recipient here is not the literary 'sahrudaya' but the'bhakta' the faithful This 'sthayibhava'known as'Madhura rati' which is the source of this particular 'rasa' is defined in terms of

love of 'Krishna' and the nature of the 'nayaka' and 'nayika' is defined in the same manner and their feelings and emotions illustrated by examples adduced from pccms dealing with the love stories of 'Krishna' and'Radha'. The work is, therefore, essentially a 'Vaishnava'religious treatise, presented in a literary garb taking 'Krishna' as the ideal hero, with caution, however, that what is true e 'Krishna' asthe herodoes not apply tothe ordinary secular hero'[117]
మొట్టమొదట రాధాకృష్ణ మధురభక్తి జయదేవుని గీతగోవిందంలో మనం చూడగలం. అదే కాలానికి చెందిన తమిళ పన్నిద్దరాళ్వారుల వైష్ణవ భక్తి సైతం మధుర భక్తియే. హరివంశంలోని గోపీకృష్ణుల భక్తి తెలుగులో ప్రప్రథమ మధురభక్తి. ఆ వెనుక పోతన భాగవతంలో గోపీకృష్ణులలో ఈమధురభక్తి వెల్లివిరిసింది. పదకవితా పితామహుడైన అన్నమాచార్యుని సంకీర్తనల్లోను, ఆ వెనుక క్షేత్రయ్య పదాల్లోను మధురభక్తి మరింత పుష్టి చెందింది. అటు బెంగాలీలో వల్లభాచార్యుని పుష్టి మార్గంలో ఈ మధురభక్తి గోపీకృష్ణుల మూలంగా పరిపుష్టి చెందింది. చైతన్యస్వామి, విద్యాపతి, మీరాబాయి ఇలాగా ఎందరో మహానుభావులీ మార్గాన్నను సరించి ఈమధుర రసాస్వాదన చేసి తరించారు. భక్తాదులను తరింపజేశారు.

ఎఱ్ఱన హరివంశంలో మన మా మధుర భక్తి రసాస్వాదన చేయవచ్చు. తెలుగులో ఈ సిద్ధాంతానికి ఇదే ఆరంభమన్న విషయం పూర్వోక్తం.

వ్రేపల్లెలో శ్రీకృష్ణుడు వేణుగానలోలుడై ఉండగా గో,గోప గోపీజనం మధుర భక్త్యంబుధి మునిగి పోయినట్లు ఎఱ్ఱన అత్యంత మనోహరంగా వర్ణించి తరించాడు మనలను సైతం తరింప జేశాడు.

"గోపాలురు తద్వేణుర
వాపూరములోన మునిగి యానంద రస
శ్రీపరిణతి నాత్మీయ
వ్యాపారము లెల్ల వదలి రవిచేష్టితులై"[118]

"అత్తఱిఁ బల్లెలోనఁ గల యంగన లెల్ల సముత్సుకంబులై
చిత్తము లెత్తి తేర యదుసింహుని పాలికి నేగుదెంచి యు
ద్యుత్తమ సౌకుమార్యనిధి యుజ్జ్వల లీలలు మెచ్చి రాగముల్
కుత్తుక బంటియై యెసగఁ గ్రోలిరి చూడ్కులఁ దన్ముఖేందువున్"

"తగిలిన చూడ్కులు మగుడన్
దిగువ వెరవు లేక మదను త్రిప్పులఁ బడు న
వ్వగువల తగు లాత్మీయం
బగు కోర్కికిఁ దగిన నాతఁ డామోదమునన్"

"అనురూపాలోకనముల
ననురూపాలాపములను ననురూప విచే
ష్టనములఁ దనమనసు తెలం
గును వారికిఁ దెలియఁ జేసి కుతుకము వెనిచెన్"

"ఇట్లు వశీకరించి యందఱం గళిందకన్యాతీర కాంతారంబుల కెలయించిన"

"తల్లిదండ్రులు మాన్ప భర్తలు మగుడ్పఁ
జెలులు వలదనఁ జుట్టలు సిగ్గుపఱుప
వ్రేత లొకటియు నెఱుఁగక వెన్నువెనుకఁ
దగిలి పోయిరి తమకంబు తవులు కొనఁగ"

"హరి చేష్టితములు గ్రమమున
మరిగి నిజముగాఁ దమతమ మగలఁ దొరఁగి యా
హరి యంద భర్తృ బుద్ధిం
బరిణతలై రా వ్రజంబు బాలిక లెల్లన్" 119

"లలితాలోకములన్ మనోజ్ఞ మధురాలాపమ్ములన్ విస్ఫుర
త్కలహాసంబుల బంధుర సత్కరోత్తానాంగ సంగంబులన్
విలసద్వక్త్ర సరోరుహార్పణములన్ స్నిగ్ధోరు సంశ్లేషసం
బులఁ బూజించిరి గోపభామలు జగత్పూజార్హు దాశార్హునిన్"

"హరి చరితంబులు రస ని
ర్భరములుగా జతలు గ పాడుదు రాతం
డరుదుగఁ బాడఁగ నాడు
రురు ర కరతాళ సం తోన్మద గతులన్" 120

ఇలాగా మధుర భక్తి రస సంభరితలై గోపికలు గోవిందుని గొలువ రాసక్రీడ సైతం కొనసాగింది.

"పెడియేనిక పదువు వాదువఁ
గడుపేడుకఁ గ్రాలు గంధగజపతి మాడ్కిన్
బడతుల నడుమ యదూద్వహు
డడవుల నొప్పారెఁ బటు మదాంధ స్ఫూర్తిన్" 121

ఇది మధుర భక్తి రస సంభరితమైన ఘట్టం. ఈఘట్టాన్ని ఎంతో హృద్యంగా ఔచిత్యంతో ఎఱ్ఱన రచించినతీరు తరువాతి కవులకు మూలమని చెప్పడంలో సందేహం లేదు.

ఇంక ముగింపుగా ఇక్కడ ప్రత్యేకంగా ప్రహ్లాదునిభక్తితత్వాన్ని ప్రశంసించడం ఎంతైనా అవసరం. గాంభీర్యం ఒక గుణం. ఒక వ్యక్తి రాజసానికి, ఔన్నత్యానికి నిదర్శనమైన లక్షణం. ఇంకా ఎన్ని కష్టాలు, నష్టాలు కలిగినా వాటిని లెక్కచేయక అగాధ సాగర గాంభీర్యం గలవాణ్ణి గంభీర స్వభావుడనడం లోక సహజం. ఎఱ్ఱన ప్రహ్లాదుని గాంభీర్యయుక్తునిగా వర్ణించడం విశేషం. తండ్రి హిరణ్యకశిపుడు శతవిధాలా నచ్చ చెప్ప యత్నించి చివరికి, ఘోరహింసకులోను చేసినా కుమారుడు ప్రహ్లాదుడు లెక్కచేయడు. కడసారిగా రాక్షసగురువు శుక్రుడు ప్రహ్లాదునితో "అన్నా! బాధలఁ బొందనేల బవకా జ్ఞాయత్త చిత్తుండవై యున్నన్ సేమముగాదె?" అని

"జననీ జనకుల కప్రియ
మనఁజను సద్ధర్మమైన నది దురితము కా
మును లుగ్గడింతు రది నీ
మనమునఁ దలపోసి నుపలనె మహిత విచారా" 122

అని ప్రబోధిస్తాడు. ఇక్కడ ప్రహ్లాదుని 'మహిత విచారా' అని సంబోధించడంలో అతని గాంభీర్యం గోచరిస్తుంది. అది అతని సమాధానంలో గంభీర రసమై ఒప్పుతూంది. ఆ పలుకులివి

"అనినఁ గేలుమోడ్చి యద్దానవాన్వయా
చార్యుఁజూచి వినయ సంప్రయోగ
కలిత చిత్తుడగుచు గంభీర రసమున
నిట్టులనియె బాలుఁడెల్ల వినగ"

"మీ రరయని ధర్మంబుల
పేరలు నెఱుకలును గలవె మీకుం దగవే
నారాయణ భక్తి పరత
వారించెద ననుట యిట్లు వైదికవర్యా!"

"తామసు డీతండు విష్ణు మ
హామహిమల కొలఁది యెఱుఁగఁడద్దేవు వెసన్
వేసూఱు నలుగ నంతయుఁ
సోమించిన మునిని బ్రతుకు సులభంబగునే" 123

అని చెప్పడమే గాక విష్ణుభక్తి వైశిష్ట్యాన్ని వివరించాడు.

"వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి
తగదను తండ్రియుఁ దండ్రిగాడు
వేదచోదితమైన విష్ణుధర్మమునకుఁ
గాదను గురుఁడును గురుఁడుగాఁడు
భవదుఃఖములు వాపఁ బ్రభువైన హరిసేవ
వలదను హితుఁడును హితుఁడుగాఁడు
పరయోగ మతమగు వైష్ణవ జ్ఞానంబు
వదలిన చదువును చదువుగాదు

కేశవాకార లీలలు గీలుకొని ము
దంబు బొందని తలఁపును దలఁపుగాదు
మాధవ స్తోత్రఘన సుధా మధుర రుచులఁ
జొక్క కుండెడు జిహ్వయు జిహ్వగాదు" 124

—అని ఖచ్చితంగా చెప్పగలిగిన హరిభక్తి నిష్ఠాపరుడు ప్రహ్లాదుడు.

ఈ విధంగా ఎఱ్ఱన నృసింహపురాణంలో ప్రహ్లాదుని భక్తి, హరివంశంలో వివిధ భక్తుల శ్రీకృష్ణ భక్తి రస పరిపాకంలో ముంచితేల్చి మనోహరం గావించడం ఎఱ్ఱనకే సాధ్యమైంది.

# సూచికలు

1. హరివంశము ఉ.భా 3—8
2. పై దే ,, 3—9
3. ,, ,, 3—43
4. ,, పూ.భా 8_177
5. ,, ,, 8—183
6. ,, ,, 8 -26, 27, 52, 53
7. ,, ,, 8—34, 38
8. శ్రీమదాంధ్ర మహాభారతము, అరణ్య పర్వ శేషము 6—145, 146,148
9. నృసింహపురాణము 2_77, 86
10. పై 8 లోనిదే 6_250
11. డా॥ పి. యశోదారెడ్డి: తెలుగులో హరివంశములు పు 231
12. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం; లక్ష్మీరంజన వ్యాసావళి పు_54
13. హరివంశము, పూ.భా 3_43, 44
14. ,, ,, 4—27, 28, 30
15. ,, ,, 5_13, 14
16. ,, ,, 5_132
17. ,, ,, 5_132, 133, 135. 136
18. ,, ,, 8_156
19. ,, ,, 9_151
20. ,, ,, 9—152, 153, 154
21. ,, ,, 9_168
22. ,, ,, 9—173
23. పై 8 లోనిదే 5_177
24. పై 8 లోనిదే 5_327

25. హరివంశము పూ.భా 7–38, 40

26 నృసింహ పురాణము 4–163, 169

27. ,, 4–170 171, 173

28. ,, 5–95, 97

29. పై 8 లోనిదే 4–352, 353

30. ,, 4–355

31. పై 25 లోనిదే పూ.భా. 4–34, 35

32. ,, ,, 4–135, 136

33 ,, ,, 5–150

34. ,, ,, 9–115

35. ,, ,, 9–116, 123, 124

36. ,, ,, 9–141, 142

37. ,, ,, 9–145, 147

38. ,, ,, 9–183

39. ,, ,, 9–185, 186, 187, 188

40. పై 8 లోనిదే 5–434, 435

41. ,, 6–251, 252

42. ,, ,, ,,

43. ,, 6–253

44. ఎఱ్ఱాప్రెగ్గడ అనువాద పద్ధతి–శ్రీగోవిందరాజస్వామి కళాశాల పత్రిక 1974–75 పుటలు 25–28

45. నృసింహపురాణము 2–100

46. హరివంశము ఉ.భా 3–99, 100

47. తెలుగులో హరివంశములు పు–231

48. పై 46 లోనిదే పూ.భా. 8-42

49. ,, ,, 9_97

50. ,, ,, 9—134

51. ,, ,, 4_34, 35

52. పై 45 లోనిదే 5_79

53. ,, 5-81

54. ,, 4_139

55. పై 8 లోనిదే 6_186

56. ,, 6_116

57. ,, 5—423

58. ,, 6—235

59. పై 45 లోనిదే 5—100

60 పై 46 లోనిదే పూ.భా. 3—181

61. ,, ,, 9_132

62. ,, ,, 6-44

63. ,, ,, 6_48

64. ,, ఉ భా. 1_96, 97

65. ,, ,, 1_98, 99, 100

66. ,, ,, 1—101

67. ,, ,, 2—80

68. ,, పూ.భా. 8, 192, 199

69. ,, ,, 9_209-212

70. ,, ,, 7_175_182

70. ఎఱ్ఱయ కవిత, సారస్వత వ్యాసములు—ప్రథమ సంపుటము పు 81_84

72. అరణ్య పర్వ శేషము 4_252, 254

73. పైదే 7_391_464

74. ,, 5, 342, 343
75. పై 46 లోనిదే పూ.భా. 4-38
76. ,, ,, 4-194, 195
77. ,, ,, 8_133_134
78. ,, ,, 9_135, 136, 137
79. ,, ,, 5-120
80. పై 45 లోనిదే 5_146
81. ,, ,, 5_112, 113, 114, 115
82. పై 46 లోనిదే ఉ. భా. 3-60, 62
83. ,, ,, 8-104, 105
84. ,, ,, 10_266, 267
85. ,, ,, 3_99, 101
86. ,, ,, 3_32
87. ,, ,, 3_33
88. నృసింహపురాణము 5_195
89. ,, 1_145
90. ,, 4_84
91. ,, 4_126, 127
92. ,, 2_35
93. ,, 1_103
94. పై 72 లోనిదే 4_376
95. హరివంశము పూ.భా. 8-200
96. పై 88 లోనిదే 3-10
97. ,, 5_111
98. పై 95 లోనిదే పూ.భా. 7-217, 218
99. ,, ,, 1_52_53

100. ,, ,, 8–173
101. పై 89 లోనిదే 4_36
102. పై 95 లోనిదే పూ.భా. 8_123
103. ,, ,, 7-234, 235, 236
104. పై 88 లోనిదే 3_52
105. ,, 4–129
106. ,, 3–27
107. పై 95 లోనిదే పూ.భా. 8_190–200
108. ,, ,, 8–136
109. ,, ,, 3_226, 244
110 పై 88 లోనిదే 5_145
111. ,, 5_118
112. ,, 5_119
113. కావ్యాలంకార సంగ్రహము పు 302, 303
114. పై 95 లోనిదే పూ.భా. 5_154, 157
115. ,, ,, 5_236, 240
116. ,, ,, 9_148
117. S. K. De: Sanskrit-Poetics as a study of Aesthetic - Aesthetic Enjoyment P-61
118. పై 95 లోనిదే పూ.భా. 8_9
119. ,, ,, 8–10,14,16
120. ,, ,, 8_19,21
121. ,, ,, 8_24
122. పై 88 లోనిదే 1_14 15
123. ,, ,, 5–16,17,19
124. ,, ,, 5–22

# 4. ఎఱ్ఱన సాహిత్యం-అంగిరస ప్రస్థానం :

ఇతః పూర్వం నవవిధరసాలు, భక్తిరసం, మధురభక్తి ఎఱ్ఱన తన కృతులలో పరిపోషించిన తీరు తెన్నులను చవిచూశాము. వీటిని వ్యస్తంగా వివరించడం జరిగింది. కాగా ఆయాకృతులలో ప్రధాన రసాలు అంటే అంగిరసాలు ఏవి ? అనే అంశాన్ని సైతం మనం సమీక్షిస్తే అప్పుడు ఎఱ్ఱన కృతులలోని రసప్రస్థాన అధ్యయనం పరిపూర్తి అయినట్లే.

## 4.1 నృసింహపురాణము :

పైని వివరించినట్లు అన్ని రసాల్ని ఎఱ్ఱన ఎంతో సామర్థ్యంతో పరిపోషించాడు. అవన్నీ అంగరసాలుగానే భాసిస్తూ ఉంటాయి. పోతే ఆయా కృతులలో అంగి రసాలు ఎలా వర్ణితమో పరిశీలిద్దాము. ఎఱ్ఱన నృసింహపురాణములోని కథ అందరికీ తెలిసిందే. అది ప్రసిద్ధ భక్తుడు ప్రహ్లాదుని చరిత్ర. హిరణ్యకశిపుడు వరగర్వితుడై ఇంద్రాదులను జయించి దేవతలను బాధించగా విష్ణువును వేడుకొంటారు. విష్ణువు నృసింహావతారమెత్తి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని తన భక్తులలో శ్రేష్ఠునిగా మన్నించి పట్టాభిషిక్తుని చేస్తాడు. ఇది ఇందలి కథ. ఇందలి ప్రధాన రసం శాంతమని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు స్థాపించారు. "ప్రహ్లాదుడు తండ్రికిని, గురువులకును, దైత్యబాలకులకును హరి మహిమానుభావములు వర్ణించుచు గావించిన యుపన్యాసములు భక్తి జ్ఞానముల కాలవాలములు. హిరణ్యకశిపుడెన్ని విధముల హింసింపఁజూచినను ప్రహ్లాదుఁడక్షతుఁడై వెలయుట కాతని భక్తి సంపదయే కారణము. అందుచే నీభాగమున నెడనెడ నితర రసముల పరిపోషణముకూడఁ గానవచ్చుచున్నను ప్రధానరసము శాంతమే. అహోబలక్షేత్రమాహాత్మ్య నిరూపకమైన నరసింహుని సేవించుట వలన మోక్షము కరతలామలకమగునని చెప్పఁబడినది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధించుటకును, హింసించుటకును గావించిన ప్రయత్నములం దొకవంక వీరరౌద్రములును వేఱొక వంక సద్భుతమును గోచరించుచున్నవి. నరసింహావిర్భావ ఘట్టము రౌద్రాద్భుతముల సమ్మేళనము. నరసింహునితోఁ బోరుటకై హిరణ్యకశిపుఁ డుత్సాహించు పట్టున వీరమును, నరసింహుడు హిరణ్యకశిపుని చీల్చి చెండాడు సందర్భమున రౌద్ర బీభత్సములును చక్కఁగాఁ బోషింపబడినవి.

"ద్వితీయాశ్వాసమున హిరణ్యకశిపుని.... ...తపో వర్ణన సందర్భము పరస్పర విరుద్ధములైన శాంతవీరముల కాలవాలమై యొప్పారుచున్నది. అచ్చరలు హిరణ్య కశిపుని నాకర్షించుట కెన్ని విలాస విభ్రమము లాచరించినను లాభము లేకపోయెను 'వెలయంగ నడవిఁ గాచిన వెన్నెలలై' యవి ఘువిఘీఁబోయెను. దీనికంతకును హిరణ్యకశిపుని తపోనైశ్చల్యమును, ధృతియుఁ గారణములు. ఇచ్చట నచ్చరల విలాస విభ్రమములు వర్ణించుపట్ల శృంగారమును, తపోవర్ణన సందర్భమున శాంతమును గానవచ్చుచున్నవి. వరలాభానంతరము హిరణ్యకశిపుడు ప్రదర్శించిన విజయోత్సాహములకు మేరలులేవు. ఈ సందర్భమున వీర రసము పరిపుష్టి నొందుచున్నది.

"హిరణ్య కశిపుడు పెట్టు బాధలు పడలేక యింద్రాది దేవతలు బృహస్పతి పురోగాములై వైకుంఠమున కేగి నారాయణుని ముందు తమ దైన్యము వెల్లడించుచు మొఱపెట్టుకొనిరి. ఇచ్చట కరుణరసము గోచరించుచున్నది. తృతీయాశ్వాసము నందలి యుత్తరార్థమున హిరణ్య కశిపుని లీలా విహారము వర్ణితమైన సన్నివేశము శృంగారరసపూరితమై యున్నది. కలగాంచిన పిమ్మట హిరణ్య కశిపుని దేవేరి వ్యాకుల చిత్తయై తత్తరిల్లిన పట్టునఁ గరుణ రసచ్ఛాయలున్నవి.

"సనకసనందనాదు లాగ్రహోదగ్రులై జయవిజయులను శపించు ఘట్టమున రౌద్రరసమును, ఆశాపము విని జయవిజయులు మూర్ఛమునిగిన సందర్భమునఁ గరుణ రసమును గోచరించుచున్నవి. దేవతలు బ్రహ్మాదులును శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయు సందర్భములందు శాంతరసము వెల్లివిరియుచున్నది."

ఈ విధంగా నృసింహపురాణంలో "వీర రౌద్ర భయానక విస్మయాఖ్య రసములు"[2] శృంగార కరుణ భక్త్యాదులతో సంకలమై అవి అంగరసాలుగాఉండి ప్రధాన రసమైన శాంతరసపరిపోషకమై ఒప్పారుతున్నాయి. కాబట్టి ఇందలి 'అంగిరసం' శాంతరసం.

## 4.2 ఆరణ్య పర్వశేషము :

మహాభారతం నవరస భరితమై ఒప్పుతూన్నప్పటికీ శాంతం అంగిరసంగా సర్వ పండిత లోకమూ అంగీకరించి స్థిరీకరించిన అంశం. అదే విధంగా ఎర్రన పూర్తి చేసిన ఆరణ్య పర్వశేషం సైతం శాంతరస ప్రధానమే. ఆరణ్య పర్వం సర్వమూ పాండవుల

వి=11)

కష్టాలకు, కడగండ్లకు కూడలి. అయినా అందులోనూ ఈ నవ రసావిష్కరణకు అవ కాశం లేకుండా పోలేదు. "శారద రాత్రులుజ్జ్వలలసత్తర తారక హార పంక్తులం జారు తరంబులయ్యె...."[3] అన్న పద్యంతో మనోహరంగా ముగిసి పోగా, ఆ వెంటనే ఆ స్ఫూర్తి ఏ మాత్రమూ చెడకుండా ఎఱ్ఱన తన అరణ్య పర్వ శేషాన్ని ఆరంభించాడు.

"స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరి వోయి నిరస్త నీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్"[4]

—ఈ విధంగా ఆరంభమైన అరణ్య పర్వ శేషం నవరసాలకూ ఆకరమే అయినా పర్వాంతంలో పూర్వోక్తమైనట్లు – ధర్మజుడు యక్ష ప్రశ్నలకు సదుత్తరాలిచ్చి సోద రుల బ్రతికించు కోవడంతో యముడు ప్రీతుడై ధర్మజునకు ఇష్టావాప్తి కలిగించి అను గ్రహించడంతో పూర్తి కావడం వల్ల ఇందు శాంతమే ప్రధాన రసంగా పరిగణింప బడుతుంది. మరో విశేషమూ ఉంది. శమనుడు యముడు, శాంత రసానికి స్థాయి భావం శమము. ఇక్కడ యమునితో ఈ పర్వం పరిపూర్ణం కావడం ప్రతీకాత్మకంగా శాంతరస ప్రధానమని భావించడంలో దోషంలేదు. దుర్యోధనుని ఘోషయాత్ర వీర భయానక రౌద్రకరుణ దయావీర రసాలకు ఆటపట్టు. సైంధవుడు ద్రౌపదిని మోహించి అపహరించడంలో వీరరౌద్ర హాస్య శృంగారాభాస దయా వీర రసాలు పరిపుష్టమయ్యా యి. శ్రీరామకథ నవరస సమ్మిశ్రితం. సావిత్ర్యుపాఖ్యానం – పూర్వోక్తమైనట్లు ధర్మవీర రస ప్రధానం. ధృతరాష్ట్రుడు పాండవుల అరణ్య వాసక్లేశాన్ని స్మరించి దుఃఖించడంలో కరుణరసం ఉప్పతిల్లుతూంది. ఇలాగా వీర రౌద్ర వీర భయనక కరుణ హాస్య శృంగార దయావీర దానవీర ధర్మవీరాదులైన రసాలు అంగరసాలుగా ఉండి అంగిరసమైన శాంతరసానికి పరిపోషకాలై ఒప్పుతున్నాయి. అందువలన అరణ్య పర్వ శేషంలో సహితం శాంతమే అంగిరసమని తలంచడం సముచితం.

## 4.3 హరివంశము :

ఎఱ్ఱన కృతులలో హరివంశం బృహత్తర కృతి. ఇది నవరస సంకీర్ణమై శాం తం అంగిరసంగా పరిపూర్ణత పొందింది. భారతంలో అంగిరసం శాంతం. ఖిలపురా ణమని ప్రసిద్ధి పొందిన హరివంశంలోనూ శాంతమే ప్రధాన రసమనడమే సముచితం.

హరివంశం ఖిలపురాణమనడానికి తగిన ఉపపత్తులున్నాయి. "అధ్యాయముల తుదను పర్వములు తుదను 'ఖిలేషు' అనియుండుటఁ జేసియు, ఆపెపర్వమున 'హరి వంశస్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞికమ్" "భవిష్యత్ పర్వచాప్యక్తం ఖిలేష్వే వాద్భుతం మహత్" అనియు "ఖిలేషు హరి వంశశ్చ భవిష్యచ్చ ప్రకీర్తితమ్' (2–71,72,257 వావిళ్ళప్రతి) అనియు నుండుటఁజేసి హరివంశము భారతమునకు ఖిలము. ఖిలమనగా పరిశిష్టము. ఆది పర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వఱకుఁగల గ్రంథము భారతమనియు హరివంశముతోఁ గలిసిన గ్రంథమును మహాభారతమనియు నందురు. (పూర్వత్రాను క్తం పరిశిష్టం వస్తు ఖిల శబ్దవాచ్యమ్' బృహదారణ్యక –ఆనందగిరి వ్యాఖ్య 5.1) మహాన్ వ్రీహ్య పరాహ్ణ గృష్టీష్వా సజాబాల భారభారత హైలి హిల రౌరవ ప్రవృద్ధేషు, (6.2.38) అను ఫిట్ సూత్రమునందు మహాభారత శబ్దమును 'సుమంతు జైమిని వైశంపాయనపైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యాస్తృప్యంతు' అను ఆశ్వలాయన గుహ్య సూత్ర వాక్యమునను భారత మహాభారతముల ప్రశంస యుండుట వలన పై సూత్రకారులకు ముందే భారతమనియు, మహా భారతమనియు విభాగము కల దని తెల్లము."[5] ఇంతేగాదు ఎర్రన హరివంశంలోను ఇది ఖిలపురాణమన్న విషయం స్పష్టం చేయబడింది. హరివంశకృతిభర్త వేమభూపాలుడు —

"భారత పరాంశమని యిం
పారగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్య కథఁ దెనుంగుగ
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్"[6]

అని అడిగినట్లుంది. ఇంకా చివర జనమేజయుడు వైశంపాయనుని...

"బంధు రాష్టాదశ పర్వ నిర్వహణ సం
భావితంబగు మహా భారతంబు
హరివంశ పరిపూర్ణమగునట్లుగా గ్రమ

వ్యాఖ్యాన మొనరించి తనకు నీవు"[7] అని ప్రశంసించాడు. కాబట్టి హరివంశం భారతానికి పూరక గ్రంథమని తేలింది. భారతంలో అంగిరసం శాంతం. కను కనే ఖిల పురాణమైన హరివంశంలోనూ శాంతమే అంగిరసం. ఈ విషయం స్పృశించే ముందు మనం భారతంలో శాంతం ప్రధాన రసమని వివరించిన విశ్వనాథ సత్యనారా

య్యగారి వివరణ పరిశీలించడం అవసరం. "అలంకారికులు తొమ్మిదవ రసమును శాంతముగా స్వీకరించిరి. "నిర్వేద స్థాయి భావోస్తి శాంతోపి నవమోరసః". మహాభారతమునందు నిట్లే శాంతరసము నిర్ణయింపబడినది. మహాభారతము శాస్త్రవ్యాయ గలది. యాదవుల యొక్కయు, పాండవుల యొక్కయు అవసానముతో సమాప్తి పొందుచున్నది. అందుచేత భగవంతుడైన వ్యాసునకు ప్రధానముగా తన కావ్యము వైరాగ్యమును పుట్టించవలెనన్న తాత్పర్యము కలదిగా చేయుటయైనది. మోక్షలాక్షణిక మైన పురుషార్థము శాంతరసము ముఖ్యముగా ప్రతిపాదితమౌతున్నదని సూచింపబడి నది. దీనిని అనేక మంది వ్యాఖ్యాతలు వివరించినారు. ఆ వ్యాసుడు మహామోహము నందు మునిగియున్న లోకమునకు అతివిమల జ్ఞానదృష్టి కలిగించుటకే ఈ మహా కావ్యమును వ్రాసినాడు. ఇతర రసములచేత శాంతరసము ఇతర పురుషార్థములచేత నాల్గవ పురుషార్థము అనుగమింపబడుచున్నవి. శాంతరసమే అంగిగా చెప్పబడినది..... .....ఈ మహా కావ్యమునందు శాంతరసమె అంగి. ఇతర రసములంగములు అన్నది చక్కగా అను సంధింపబడినది.

"సనాతనుడు భగవంతుడునైన వాసుదేవుడు ఇందు కీర్తింపబడుచున్నాడు. అన్న ఈ వాక్యమునందు ఈ యర్థము వ్యంగ్యముగా నున్నది....ఈ నిగూఢ రమణీయమైన అర్థము మహాభారతము యొక్క చివర హరివంశ వర్ణనముతో మహాకావ్యమును పూర్తి చేసిన కవిబ్రహ్మయైన కృష్ణ ద్వైపాయనుని చేత స్ఫుటము చేయబడినది. ఈ అర్థముచేత వ్యాసుడు సంసారాతీతమైన తత్వమునందు భక్తి యొక్క గొప్పతనమును నిరూపించుచున్నాడు. సాంసారికమైన వ్యవహారము పూర్వ పక్షము చేయబడినది. పాండవుల చరిత్రయే వైరాగ్యమును పుట్టించునదియె యున్నది. వైరాగ్యము మోక్ష మూలము ...... మహాభారతమునందు సాక్షాత్ భగవంతుడైన శ్రీకృష్ణుడే కీర్తింపబడెను. మోక్షలక్షణమైన పురుషార్థమే యుత్కృష్టమనియు తృష్ణనశింప జేయుటయు సుఖమును పెంపొందించుటయు లక్షణముగాగల శాంత రసమే మహాభారతము నందలి అంగి రసమనియు లెస్సగా ప్రతిపాదింపబడినది.

"శాంతరసము లోకక్రియల నుండి ఉపరతి బోధించునది. యోగుల చిత్త వృత్తికి సన్నిధానమందున్నది. సర్వభావముల యొక్క ఉపశాంతి యొక్క స్వరూపమది.

"శాంత రసము క్లిష్టమైనది. అది జీవితావసానము నందు లేదా పూర్వజన్మ సంస్కార వశమున పరిణతమైన వేళయందు నిరంతర జిజ్ఞాసా శ్రద్ధా వేదాంత చర్చా

శ్రోత్ర విషయగత వైరాగ్య పరిపాకాదుల చేత సిద్ధించునది. అప్పటిది శాంతరసము. శాంతమునకే 'రసో వైసః' అని చెప్పబడును. నిర్మలినానందమునకు గుణతః మిక్కిలి దగ్గర, ప్రయత్నతః చాలదూరము. తక్కిన రసములన్నియు నీ రెంటి నడుమ ఉన్నవి.

''ఆనందవర్ధనుడు మహాభారతమును గూర్చి చెప్పుచు 'శాస్త్ర రూప కావ్య రూపాన్వయిని మహాభారతే' అన్నదిందుకనే. భగవంతుడు వ్యాసుడు తన కావ్యమునందు శాంతరసము నంగిరసముగా తీర్చిదిద్దుకొనుటకు వేదములు, నుపనిషత్తులు, శాస్త్రములు, దర్శనములు, పూర్వరాజకథలు, అర్థ వాదములు, లక్షలు నిక్షేపించుకొనవలసివచ్చెను."[8]

పై విశ్వనాథవారి పరిశీలనలో భారతంలోని ప్రధాన రసం శాంతమనీ, దానికి స్థాయి భావం నిర్వేదమనీ స్పష్టమయింది. ఇతః పూర్వం శాంత రస నిరూపణంలో స్థాయి శమమని మనం గుర్తించాము. కాబట్టి హరివంశంలోను శాంతమే అంగిరస మవడంలోను, దానికి శమం స్థాయి భావమనడంలోనూ ఎలాంటి విప్రతిపత్తి ఉండనవసరంలేదు. హరివంశం భారతానికి పూరక గ్రంథం. అంటే ఖిల పురాణమన్న విషయం ఇంతకు ముందే పూర్వ విద్వాంసులచేతా, లాక్షణికుల చేతా నిరూపించబడిన విషయమూ మనకు తెలుసు. ''సంస్కృత హరివంశమున హరివంశ పర్వము, విష్ణుపర్వము, భవిష్య పర్వమని మూడు భాగములు కలవు ...

"ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశమున ఈ విభాగములను యథాతథముగ పాటింపలేదు అసలు ఈ మూడు పర్వముల పేర్లను ఎత్రన గైకొనలేదు. ఆయన తన గ్రంథమును పూర్వోత్తర భాగములని రెండుగ విభజించెను. అందు పూర్వభాగమున తొమ్మిదాశ్వాసములును, ఉత్తర భాగమున పది యాశ్వాసములును గలవు. అదిగాక ఎఱ్ఱనకు లభించిన హరివంశము మూడు పర్వములు గలదిగాక పూర్వభాగము, ఉత్తర భాగము అనెడి రెండు విభాగములు కలదియై యుండునేమోయని సందేహించుట కవకాశము కలదు.

''ఎఱ్ఱన పూర్వభాగమున నాలుగాశ్వాసములలో హరివంశ పర్వకథా సందర్భమును ముగించెను. అటనుండి ఐదవ ఆశ్వాసము మొదలు ఉత్తర భాగములోని ఎనిమిదవ ఆశ్వాసము వరకు శ్రీ కృష్ణుని జీవితచరిత్రను క్రమముగా అభివర్ణించెను. అవన్నియు సంస్కృతమున విష్ణుపర్వమునందు భవిష్య పర్వమునందును గలవి. వ్యాసుడు భవిష్య పర్వమున చేర్చిన కృష్ణసంబంధి కథలను (హంస డిభకో పాఖ్యానము తప్ప) అటనుండి తొలగించి శ్రీకృష్ణుని జీవిత చరిత్రలో వాటికి గల అర్హస్థానమున నిల్పెను. వాటిలో హంస డిభకో పాఖ్యానము నెందులకో తడవలేదు. మరి విష్ణు పర్వ

ములోనిదే అయిన వజ్రనాభవధ యనెడి ప్రభావతీప్రద్యుమ్నోపాఖ్యానమును కూడ ముట్టలేదు. హంసడిభకోపాఖ్యానమును విసర్జించుటకేమి కారణమో చెప్పలేము రెండనదియైన ప్రభావతీ ప్రద్యుమ్నోపాఖ్యానము ఇంచుమించు ఉషాపరిణయ కథ వంటిదే కనుక దానిని వదలిపెట్టి యుండవచ్చును. ఇక మిగిలిన భవిష్య పర్వమును చాలా సంగ్రహించి తుది రెండాశ్వాసములలో ముగించెను. ఈ హరివంశానువాదము భారతానువాదము వలెనే కథామాత్రానువాదమై స్వతంత్రముగా నడచెను. కావ్య శిల్పమున కనుకూలించెడి ఘట్టములనన్నిటిని రసభరితముల నొనర్చి మూలమునకు వన్నెపెట్టెడి రచనా నైపుణిని ప్రదర్శించెను."[9]

ఇది ఎఱ్ఱన హరివంశములో అనుసంధించిన కథారీతి. తదితరాంశాలు ప్రసక్తానుప్రసక్తంగా నవవిధ రసాలు, నవవిధ భక్త్యాదులు వివరించిన పట్టులలో చదవడం జరిగింది. వాటిని మళ్ళీ పునశ్చరణ చేయడం పునరుక్తి దోషమవుతుంది. పై రసాలన్నీ అంగరసాలుగా ఉండి ప్రధాన రసమైన శాంతరసానికి హరివంశంలో పరిపోషకాలుగా ఉన్నాయి.

హరివంశ పూర్వ భాగంలో నానారాజ జనన వృత్తాంతాలతో పాటు శ్రీకృష్ణ జనన, బాల్యక్రీడలు ముగ్ధమనోహరంగా అభివర్ణించి తరించాడు ఎఱ్ఱన. గో గోప, గోపీజన జీవనవర్ణనం స్వభావ సిద్ధంగా చిత్రించి నావ్యతో దర్శనీయం చేశాడు ఎఱ్ఱన. బాల్యంలోను, ఆతర్వాత ఉత్తర భాగంలోను దుష్ట సంహారం ప్రధాన ధ్యేయం. అయా వర్ణనల్లో వీరరౌద్ర భయానకాద్భుత, హాస్య శృంగార రసాలు అతి స్నిగ్ధంగా వర్ణించడం ప్రశంసనీయం. చివరికి కథ శాంతరసంతో పరిపూర్తి చెందుతుంది. శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడు, విష్ణువుయొక్క గొప్పదనాన్ని జనమేజయునకు వైశంపాయనుడు ఇలా వరించి చెప్పాడు.

"గోప్యవేదుల కతి గోప్యుండనంగను
  తత్త్వవాదుల కాది తత్త్వమనగ
నాత్మ బోధకుల కాధ్యాత్మండనంగను
  వేదంబునకు నిత్య వేద్యుడనఁగ
గర్తయుఁ గరణంబుఁ గార్యంబు పురుషుండుఁ
  బ్రకృతియు బుద్ధియుఁ బ్రాణచయము

"గాలంబుఁగళయు వక్తయును వక్తవ్యంబు
వాక్యమును నను బహుత్వంబు లెల్లఁ
దానయై నిత్యుఁడమృతుఁడద్వంద్యుఁడజరుఁ
డప్రమేయుఁ డనాద్యంతుఁడజుఁడనంగఁ
బరగు విష్ణుండు విశ్వైక భర్త నిఖిల
మునకు నొక్కండ సంహర్త పుణ్యయశుడు"10

ఇలాగే చిత్రరేఖ ఉషతో అనిరుద్ధుని గొప్పదనాన్ని ఉగ్గడిస్తూ అతని తాత శ్రీకృష్ణుని ఔన్నత్యాన్ని ఇలా చిత్రించింది.

"త్రైలోక్యంబును నేలు దేవుఁడు ధరన్ ధర్మంబు నిల్ప న్నరుం
డై లీలన్ యదురాజ వంశమున విఖ్యాతంబుగాఁ బుట్టిగో
పాలీకేళికరుండు నాఁ బరఁగె నే భవ్యాత్ముఁ డాశౌరికిన్
బాలా మన్మఁడు వీఁడు తత్సముఁడు సౌభాగ్యానుభావంబునన్"11

ఇంతేగాదు శ్రీకృష్ణుడే తాను దుష్ట శిక్షణ, శిష్టరక్షణ కోసం అవతరించిన విషయం తానే స్వయంగా పేర్కొనడం గమనించదగ్గ అంశం.

"క్షత్రియుఁడనేను యదువంశ సంభవుండ
దుష్టమర్దన సుజన సంతోషణముల
యందుఁ జాలెడు వాడ........"12

ఇది ప్రధానాంశంగా గ్రహించి పైని పేర్కొన్న రసాలన్నిటిని పరిగణనలోనికి తీసుకొని మనం పరిశీలించినప్పుడు ఇందలి ప్రధాన రసం శాంతమని స్పష్టమవుతుంది. ఇంకా ఇందలి నిర్వేదకారణభూతమూ, శమకారణమూ అయినా తపోభక్తులను పరిశీలిస్తే ఇది మరింత దృఢపడుతుంది.

శాంతరసోపస్కారకాలైన అనేకోదాహరణలు మనం పరిశీలించాము. గోపీ కృష్ణుల, రుక్మిణీ కృష్ణుల మధురభక్తి, భక్త ఆత్మనివేదనైక ప్రపత్తి మనం చూడగలం. ఉగ్రసేనునంతటివాడు పుత్రమరణమే అయినా అత్యంత గౌరవ ప్రపత్తితో శ్రీకృష్ణుని సంభావించడం, దేవకీ వసుదేవులు, యశోదానందులు చూపిన వాత్సల్య భక్తి అత్యద్భుత వరనా వైవిధ్య వైశిష్ట్యాలతో నాస్యతో దర్శతీయం. అక్రూరుని సఖ్యభక్తి అనితర సాధ్యమైంది.

శ్రీకృష్ణుని సంహారార్థం కంసుడు చేసిన ప్రయత్నాలలో, పూతనాదుల బాల కృష్ణుడు వధకావించడం, కాళీయుని, కేశిరాక్షసుని, కువలయాపీడుని, చాణూర ముష్టిక లను, కంసుని, కాలయవనుని, నరకాసురుని, పౌండ్రక వాసుదేవుని, బాణాసురుని, బలిని సంహరించడంలో శ్రీకృష్ణుని పరాక్రమం చివరికి వారికి ఉపశాంతి లభించడం, అందునా ముఖ్యంగా బాణాసుర బలి హిరణ్య కశిపులను వధించి అనుగ్రహించడం వీటిలో ఎంతగానో నిర్వేదం స్పష్టమైంది. చివరి దశలో ఇందులో చివరికి శాంతమే పరిపుష్టమైంది. ఆయా రాక్షసుల తపస్సు, ముచికుందుని తపస్సు, చివరికి సంతానం నెపంతో శివునిగూర్చి తపస్సుచేయడానికి శ్రీకృష్ణుడ కైలాసానికి బయలుదేరడం, హరి హరాద్వైతం అభివర్ణించడం, ఘంటాకర్ణుని భక్తి, ఇంద్రాది దేవతలు గరుడుడు శ్రీకృష్ణుని స్తుతించడం వీటన్నిటా శాంతమే ప్రాముఖ్యం వహిస్తుంది. కాబట్టి వివరణాత్మకంగా పూర్వోక్తమైనట్లు వీరభయానక బీభత్సరౌద్ర, హాస్య కరుణాద్భుత భక్తి శృంగారాది అంగరసాలతో శాంతరసం ప్రధాన రసంగా పరిపుష్టి చెందుతూంది.

కాబట్టి భారతానికి పూరక గ్రంథమైన హరివంశం భారతం లాగానే శాంతం అంగిరసంగా గలిగిన ఉత్తమ కృతి. ఎఱ్ఱన ఈ మహాకృతి రచన మూలంగానే నన్నయ తిక్కనలతో సమానస్థానమాక్రమించి సరిగద్దె నెక్కినట్లు స్పష్టమవుతుంది. ఈ కవిత్రయం ఆంధ్రులందరికీ ఆరాధ్యులయ్యారు. ఎఱ్ఱన ఈ కృతిద్వారా సుకృతి అయ్యాడు. ఈ విధంగా ఎఱ్ఱన కృతులలో శాంతమే అంగిరసమై అత్యంతాదరణీయమై ఒప్పుతూంది.

చివరికి లోకకళ్యాణమే ప్రాధాన్యం వహించినట్లు స్పష్టం. శ్రీకృష్ణావతారం దుష్టులను దునిమి శిష్టులను సంరక్షించడం ఎఱ్ఱన కృతులన్నిటా స్పష్టం. హరివంశంలో ఈ విషయం వ్యంగ్యంగా, వాచ్యంగా అభివ్యక్తి కరించబడ్డది. యాదవులు ఆ బాల గోపాలమూ శ్రీకృష్ణుని గూర్చి అభివర్ణించడంలో ఈ విషయం స్పష్టం.

> "ఈ వసుమతి యంతయు నిటు
> మీవలనఁ బ్రతిష్ఠవడసె మీవారగు వా
> రే వారు వారు కల్యా
> ణావాసులు దారయగుట యరిది గా యనఘా"[13]
> "అన విని రాము డిట్లనియె నక్కట యింతననేల మీరు గూ
> ర్మి నెఱయఁ బెంపగా మీ చిరశిక్షఁ జరించి యాగృహం

బున సరసాన్నముల్గుడిచి బుద్ధి దనర్చిన మాకునెందు శో
భన మగుసేమి సందియము బాంధవు లెవ్వరు మిమ్ము బోలగన్"[14]

అని స్పష్టం చేయడంతో లోకకళ్యాణార్థమే శ్రీకృష్ణుడుద్భవించినట్లు స్పష్టమవుతుంది. హరివంశం చివర భగవద్భక్తి, భారత హరివంశ పఠనం వల్ల కలిగే ఫలం వర్ణితం.

"శ్రీమహా భారతంబు హరివంశోత్తంసంబుగా నఖిలంబును యథాశ్రుత వ్యాఖ్యానంబుగాఁ జేసి మిమ్ము నారాధింపం గలిగె నే ధన్యుండనైతి"[15] నని జనమే జయుడు వైశంపాయనునితో చెప్పడమే ఇందుకు చక్కటి ఉదాహరణ.

ఇలాగా శాంతమే అంగిరసమై ఒప్పారుతుందని స్పష్టం.

ఎఱ్రన తన కృతులన్నిటా నవరస సంభరితంగా సహృదయ హృదయావర్జకంగా రచన చేసి శాంతం అంగిరసంగా పరిపోషించి ఉండడం వల్ల ఎఱ్రన రస ప్రస్థాన వైశిష్ట్యం స్పష్టం. తదనంతర కవుల కెందరికో ఎఱ్రన మార్గ దర్శకుడయ్యాడని చెప్పడం దోషం కాదు.

## సూచికలు

1. నృసింహపురాణము, పీఠిక పు. 40,41
2. ,, 5_113
3. అరణ్య పర్వ శేషము 4—142
4. ,, ,, 4_143
5. వేలూరి శివరామశాస్త్రి—ఎఱ్రన హరివంశము వావిళ్ళప్రతి-పీఠిక పు xxiii
6. హరివంశము పూ.భా 1-40
7. ,, ,, 10_291
8. విశ్వనాథ సత్యనారాయణ: విశ్వనాథ సాహిత్యోపన్యాసములు, శాంత కరుణ రసములు పుటలు 22, 26, 29, 38, 39
9. పింగళి లక్ష్మీకాంతం : ఆంధ్ర సాహిత్య చరిత్ర పు.294, 295
10. హరివంశము ఉ.భా. 10_100
11. ,, ,, 7—154
12. ,, ,, 5—179
13. ,, ,, 2—81, 82
14. ,, ,, 2—81, 82
15. ,, ,, 10_347

# 5. ఎఱ్ఱన – సోమన – పోతన : రస పోషణ

ఈ ప్రకరణం పూర్వప్రకరణాలకు ఉపసంహారం మాత్రమే. మూడు, నాలుగు ప్రకరణాలలో ఎఱ్ఱన తన కృతులలో గావించిన రసప్రస్థానాన్ని అన్ని దృక్కోణాల నుంచి మనం పరిశీలించాము ; అతని రసపోషణాచణత్వాన్ని గ్రహించాము. కాగా ఈ సింహావలోకంలో ఎఱ్ఱన సమకాలికుడైన సోమన, తరువాతి వాడైన పోతన రస దృష్టిలో ఏమేరకు ఎఱ్ఱనతో తులతూగగలరో ఇంతః పూర్వమే పండిత ప్రకాంతులు చెప్పిన అభిప్రాయాల్ని ఒకే చోట సమీక్షించడమే నాయీ లక్ష్యం. తన్మూలంగా ఎఱ్ఱన రసదృష్టి సమున్నతమైందని గ్రహించడం సాధ్యమవుతుంది.

"ఇది మనసున నుంచుకొని యెఱ్ఱన సోమనల కవిత్వములను బరిశీలింపఁగా, రసపోషణదృష్టి యెఱ్ఱన కన్న సోమునికి దక్కువ యని నాకుఁ దోఁచెడిని. సోముని సర్వజ్ఞ బిరుదము, నవీన గుణసనాథత్వము మొదలగు వానిని గూర్చి నాయాక్షేపము లేదు .... ఐనను రసప్రవాహమున నెఱ్ఱన యందున్నంత బిగువు నిర్మలతయు నితని యెడలేవు. ఒక్క ఉదాహరణము మన్నింతురు గాక. ఉలూఖల బద్ధుఁడగు బాలకృష్ణుఁడు రోటిని జమిలి మద్దుల నడుమ నీడ్చుకొని పోఁగా, నా చెట్లు కూలెను. అప్పుడు కొందరు గోపికలు సంభ్రాంతలై పాటి వచ్చి యశోదతో నిట్లనిరి :

"ఎక్కడి బిడ్డ నీకు ? నిటులెంతయుఁ గట్టిఁడి వేయుగంబులన్
బొక్కఁడు రోటితో బలియుఁబుత్రుని ద్రాళులఁ గట్టి నాఁడు వా
రక్కట ! కల్గిరే ! వినఁగ, నాఱడి వోయెఁగుమారుఁ డేపునన్
మిక్కుటమైన మ్రాఁకులవె మీఁదఁబడన్ వడిఁదాఁ బెనంగెడిన్

(హరివంశము. పూ.బా. 5–247)

"అనినం దల్లడమంది మేను విరియన్ హాయంచు గోపాల భా
మిని విస్రస్తములై పటాంచలము ధమ్మిల్లంబుఁ దూలంగ లో
చన పద్మంబుల బాష్పధార లెసఁగన్ సంభ్రాంతిఁ బాదద్వయం
బును తొట్రిలఁగఁ బాఱె గోపికలు నుద్భూతార్తలై తోఁ జనన్"

(హరివంశము—పూ.భా. 5–149)

ఉత్తర హరివంశమున అనిరుద్ధుఁడు చిత్రరేఖచే నపహరింపఁబడఁగా నతని యాఁడువారు—

"చెందమ్మి విరులలోఁ జిందు తేనెలు వోలెఁ
గన్నుల బాష్పాంబు కణము లదర,
వలుద చీఁకట్లలో వ్రాలు చుక్కలు వోలె
వేణి భరమ్ములో విరులు వ్రేలఁ,
మాలు తీగెల వెంటఁ దూగు తేటులు వోలె
నసదు నెన్నడుములు నారు లొలయ,
రావు జక్కవలఁ జేరని చంద్రికలు వోలెఁ
జన్నుల ముత్యాల సరులు పెనఁగ,

ముద్దు మోము లల్లార్చుచో మూఁపులందుఁ
గర్ణ భూషణ జాలంబు గళగళింప
మార్చి మార్చి చేతులవ్రేళ్ళ మడఁచి కొనుచు
నింక నెట్లమ్మ ! యంచు నయ్యింతులేడ్వ" (ఉత్తర హరివంశము 5-276)

పై రెండు పద్యములను బరీక్షింపవేఁడెదను. ఏడ్పు సన్నివేశమొక తీరయినను రసధార రెండవ పద్యము కన్న మొదటి దాని యందు తీక్ష్ణము కాదా ? రెండవదాని యందు చమత్కార మెక్కువ యని యంగీకరించితి. కాని యంత మాత్రమున మనము మోసపోరాదు. యశోద వెంటనే, కృష్ణుడు కాలో, చేయియో విఱుచు కొన్నట్లు, ఎఱ్ఱన గూడ 'సంభ్రాంతి'తో. బరువునట్లు, మనల బరువెత్తించినట్లు ఉన్నది మొదటి పద్యము. రెండవది, యేడ్చు వారితో సానుభూతి లేక తూలికయు, వన్నెలుఁ దీసికొని నిదానముగా నప్పుడుఁ జిత్రించి నట్లున్నది. 'చెందమ్మి విరులలోఁ జిందు తేనెలు, 'వలుద చీకట్లలో వ్రాలుచుక్కలు' మొదలగు భావములుదారములే ; చమత్కార జనకములే : కాని ప్రకృత రసముతో సంబంధము వానికి లేదు ; ఇది గాదు చోటు వానికి. మొదటి దాని యందు 'విశేషమేమియులే' దని భావించెదరు వీరరాజుగారు. విశేషములలో విశేష మగు రసమందున్నది. సోముని పద్యము వ్రాయుటకు అతని వంటి ప్రతిభాశాలియే కావలయును. గాని ఎఱ్ఱన పద్యముల వంటి పద్యముల నెవ్వరైన వ్రాయగలరని పంతులు గారందురు ........ కాని వారి సిద్ధాంతము వేరని మొదలే విన్నవించితిని"1 ఇది రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి సిద్ధాంతం.

"ఎఱ్ఱయగారిపైన ఎంతోగానో పరిశోధనలు చేసిన వేలూరి శివరామశాస్త్రిగారు నిష్పక్షపాతంగా నలభై యేళ్ళ కిందట ఇలా వ్రాశారు.

'నాచన సోముని యుత్తరహరివంశమును నొకేమారు గ్రమక్రమముగా జదువుచు బోవగా సోమననే యెఱ్ఱన యనుకరించినట్లు నాకు దోచినది. విద్యాస్నాతకులు సత్యమునకు నిశ్చాయలకుగుదురుగాక !' (సోముడు—ఉత్తర హరివంశ విమర్శ. పుట 15)

"అయితే నాకు మాత్రం సోముడే ఎఱ్ఱయ గారిని అనుకరించాడనిపిస్తున్నది."[2]

ఈ విషయంలో శివరామశాస్త్రిగారి అభిప్రాయం ఏమైనా వారు ఎఱ్ఱయ గారి గురించి చెప్పిన ఈ క్రింది మాటలు అక్షరాల నిజము.

'ఎఱ్ఱయ జన్మతః కవి. భావుకత అతనికి పరివేషము. అతని కవితాశయ్య పుష్ప గుంఫితము. హృదయము 'రసప్రస్రవణము' (నృసింహపురాణము పీఠిక, పుట 17)"[3]

— ఇది ఆరుద్రగారి అభిప్రాయం.

కాగా పింగళి లక్ష్మీకాంతం గారు ఇలా సెలవిచ్చారు. "ఈ ధర్మములను బట్టి చూచినచో, ఎఱ్ఱన కవితలో గల సత్వసిద్ధి సోమన కవితలో లేదు. సోమన రస భావము ఆవేశమున విశృంఖల విహారము చేయుచుండగా, ఎఱ్ఱన భావము సత్వసంయమితమై గంభీర మందగమనముతో సాగిపోవును. సోమన భావ గమనము లేడి పరుగు వంటిది ఎఱ్ఱనది గజగమనము. సూర్యకిరణ స్పర్శచే తామరస కోరకము చలించి, వికసించి మకరంద నిష్యందియైనట్లు కవివాక్కిరణ స్పర్శచే భావుకుని హృదయము స్పందించి విప్పారి ద్రవీకరించును .... మన మూతని (సోమన)ని మెచ్చుకొందుమే గాని, అతనిలో లీనము కాలేము. ఈ పరమానుభూతిని ఎఱ్ఱన సుకరముగ కలిగింపగలడు."[4]

ఇది ఇలా ఉండగా ఎఱ్ఱన, పోతనల రసదృష్టిని ఖండవల్లి లక్ష్మీరంజనం గారు ఇలా అంచనా వేశారు.

"హరివంశమునందు శ్రీ కృష్ణుని జీవితము సవిస్తరముగ వర్ణింపబడినది. విష్ణుని దశావతారకథలును సంగ్రహముగ చెప్పబడినవి. శ్రీ కృష్ణ జీవితము భాగవతము నందును వర్ణింపబడినది. పోతనామాత్యుడు భక్తాగ్రేసరుడు. హృదయవాది కవి. అతడు శ్రీకృష్ణుని భగవంతునిగను, అతని చరిత్రను మానవవ్యాపారాతిరిక్తముగను, చిత్రించెను. ఎఱ్ఱనగారు శ్రీ కృష్ణుని వీరరసోత్తుంగునిగను సందర్శించెను.

శ్రీకృష్ణుడు భగవదవతారమను విషయములో అతనికిని సందియము లేదు. అయినను అతని చర్యలన్నియు అలౌకిక చర్యములు, అద్భుతాశ్చర్య సంపాదకములుగ ఎఱ్ఱన చూపలేదు. శ్రీ కృష్ణుడు విష్ణ్వంశ జనితుడయ్యును మానవ సులభమైన లేక సాధ్యమైన శక్తి సామర్థ్యముల చేతనే తన జన్మోద్దేశమును పూర్తి చేయుచు కార్యావసరమును బట్టి అలౌకిక సామర్థ్యమును ప్రదర్శించినట్లు ఎఱ్ఱనార్యుడు చిత్రించెను. హరివంశము లోని కష్టములన్నియు దుష్టశిక్షణ, శిష్టరక్షణతో సంబంధించినవి. ఇదియే శ్రీ కృష్ణావతార సాఫల్యము గదా? ఈ కార్యములందు శ్రీ కృష్ణుని లోకాతీతమైన బలశౌర్యములును అతని అనన్య సామాన్య బుద్ధి బలమును మిక్కిలి ప్రకాశించును. అక్కడ శ్రీ కృష్ణుని శృంగార జీవితముతో ఎక్కువ ప్రసక్తి లేదు. పోతనగారు శ్రీ కృష్ణుని జీవితమునందు శృంగారరసలక్షణము లరయబోయి, కొన్ని యెడల నా మహా పురుషుని జీవితమును సందేహావర్తములలో దిగవిడిచినాడు .... హరివంశమునందిట్టి సందిగ్ధ స్థానములు లేవు.

"ఇట్లు ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి తన హృదయమార్దవమును, సర్వంకషమనీషను, నిర్విరోధ కవితా ధారను వేయి విధంబుల ప్రదర్శించినాడు. ఆతడు సంస్తవనీయమైన వినయము గల వాడగుటచే నన్నయ తిక్కనలను తనకు కవితా గురువులుగా పొగడుచు వచ్చినను ఆతడు ఆ మహనీయాచార్యులతో తుల్యాచార్యుడనుట నిస్సందేహము"[5] ఈ గుణాలన్నీ రాశీభూతమై రస నిర్వహణచణత్వంలో ఎఱ్ఱనను మహాకవిగా, ప్రబంధ పరమేశ్వరునిగా తీర్చిదిద్దినట్లు స్పష్టం కాక మానదు.

ఔచిత్య సంభరితమైన రచనా నైపుణ్యానికి, శృంగారరసపరిప్లుతి సంయమన సంపూర్ణమూ అయిన సమతా రీతికి రుక్మిణీ కృష్ణుల ప్రథమ సందర్శనం ఎఱ్ఱన కవితా వధూటీ కిరీటానికి కలికితురాయి.

> "పతి చూపున్ సతి చూడ్కియున్ సమగతిం బ్రస్ఫీత రాగంబులై
> ధృతివాయం బయిలోట యొల్లగిల నుద్వేగంబుజన్ హ్రీ పతి
> చ్యుతి వాటిల్లఁ బరస్పరాంగములపై నొండొండ బ్రాఁకగఁద
> చ్చతురావస్థఁ గృతార్థ దంపతుల యోజంబొల్చె నిర్వ్యాజతన్"[6]

అను।

)....(

# సూచికలు

1. సారస్వతాలోకము పు. 129—132
2,3. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం
3వ సంపుటి పు. 176, 188
4. ఆంధ్ర సాహిత్య చరిత్ర పు. 337, 338
5 లక్ష్మీ రంజన వ్యాసావళి పు. 56, 57, 63.
6. హరివంశము ఉ.భా. 3—80.

# ఉపయుక్త గ్రంథాలు


1. అనంత కృష్ణశర్మ, రాళ్ళపల్లి : సాహిత్యాలోకము.
2. అప్పారావు, పి.ఎస్.ఆర్ (అను) : నాట్యశాస్త్రము
3. ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.
4. ఆంధ్ర మహాభారతోపన్యాసములు; ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు
5. ఆరుద్ర : సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సం. 3
6. ఎఱ్ఱన : ఆరణ్య పర్వ శేషము : శ్రీమదాంధ్ర మహాభారతము—ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ సంశోధిత ప్రతి.
7. ,, : ఆరణ్య పర్వశేషము : శ్రీమదాంధ్ర మహాభారతము—వావిళ్ళ ప్రతి.
8. ,, : నృసింహపురాణము : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్
9. ,, : హరివంశము : వావిళ్ళప్రతి
10. కోటేశ్వరరావు, తుమ్మపూడి : ఆముక్తమాల్యదా సౌందర్యము
11. గంగప్ప, ఎస్ : తెలుగులో పదకవిత.
12. ,, : తెలుగు వాగ్గేయకారులు.
13. ,, : సారంగపాణి పదసాహిత్యం.
14. ,, : క్షేత్రయ్య పద సాహిత్యం.
15. గోపాలస్వామి, కె.వి. (సం) : ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము.
16. చంద్రశేఖరరెడ్డి, ఆర్. : శిల్పప్రభావతి.
17. జగన్నాథ పండితరాయలు ; రసగంగాధరం.
18. తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి కళాశాలా పత్రిక—1974-75
19. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సం. 4
20. ధనంజయుడు ; దశరూపకం.
21. నరసింహం, కె.వి.ఆర్ ; సాహిత్యదర్శనము.
22. నాగయ్య, జి : ఆంధ్ర వాఙ్మయ సమీక్ష
23. ,, : ఎఱ్ఱన శ్రీనాథుల సూక్తి వైచిత్రి
24. పోతన ; శ్రీమదాంధ్ర భాగవతము.
25. బాపూజీ, జంధ్యాల జయకృష్ణ : శ్రీనాథుని సాహిత్యప్రస్థానము.
26. భరతుడు : నాట్యశాస్త్రం.
27. భోజదేవుడు : సరస్వతీ కంఠా భరణం (అను) స్ఫూర్తి శ్రీ.

28. యశోదారెడ్డి పి. : ఎర్రన
29. ,, : తెలుగులో హరివంశములు.
30. లక్ష్మీరంజనం, ఖండవల్లి : లక్ష్మీరంజన వ్యాసావళి.
31. లక్ష్మీకాంతం, పింగళి : ఆంధ్రవాఙ్మయ చరిత్ర
32. ,, : సాహిత్య శిల్ప సమీక్ష
33. విద్యానాథుడు : ప్రతాప రుద్రయశోభూషణం
34. విశ్వనాథుడు : సాహిత్య దర్పణం.
35. శేషయ్య, చాగంటి : ఆంధ్రకవితరంగిణి
36. సత్యనారాయణ, విశ్వనాథ : విశ్వనాథ సాహిత్యోపన్యాసములు.
37. సారస్వత వ్యాసములు–ప్రథమ సంపుటము : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
38. సూర్యనారాయణశాస్త్రి, మల్లాది : దశరూపకము
39. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం (వ్యాఖ్య) : కావ్యాలంకార సంగ్రహము.
40. సోమన, నాచన : ఉత్తర హరివంశము–వావిళ్ళ ప్రతి.
41. వేంకటావధాని, దివాకర్ల : సాహిత్య సోపానములు.

## ఆంగ్ల గ్రంథాలు

42. Dr S.K : Sanskrit Poetics as study of Aesthefic
43. Haas, George, O.A : Dasarupa.

X—) ๑ (—X

**Prof. S. GANGAPPA** **Errana-Rasaposhana** Rs:25

## ముద్రిత గ్రంధాలు

### విమర్శలు:

1. కోలాచలం శ్రీనివాసరావు- నాటక సాహిత్యసమాలోచనము (పిహెచ్. డి. గ్రంధం)
2. క్షేత్రయ్య పదసాహిత్యం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డు పొందిన గ్రంథం)
3. తెలుగులో పదకవిత (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డు పొందినగ్రంథం)
4. వేయిపడగలు -విశ్లేషణాత్మక విమర్శ (విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు పొందిన గ్రంథం )
5. సారంగపాణి పదసాహిత్యం
6. సాహిత్యసుధ
7. జాతికి ప్రతిబింబం - జానపద సాహిత్యం
8. తెలుగు నాటకం
9. వేమనభావన
10. భాషావ్యాసాలు
11. ప్రసంగసాహితి (రేడియో ప్రసంగాలు)
12. తెలుగుదేశపు జానపదగీతాలు
13. జానపదగేయాలు (సేకరణ - లఘువివరణ)
14. కోలాచలం శ్రీనివాసరావు
15. తెలుగు వాగ్గేయకారులు
16. జానపదగేయ రామాయణం
17. సాహిత్యోపన్యాసములు -17 ఉన్నవలక్ష్మీనారాయణ శతజయంతి ప్రసంగం
18. సిద్ధేంద్రయోగి
19. ఎర్రన-రసపోషణ
20. సాహిత్యసమాలోచన
21. క్షేత్రయ్య
22. పురందరదాసు
23. నాగార్జునుడు

### పాఠ్యపుస్తకాలు:

24. 8వ తరగతి ఉపవాచకం
25. 9వ తరగతి ఉపవాచకం
26. 10వతరగతి ఉపవాచకం
27. కమర్షియల్‌ప్రాక్టీసు, సెక్రటేరియల్‌కోర్సు 1,2 భాగాలు (ఇంటర్‌మీడియేట్ పాఠ్య పుస్తకం )

### కవితలు:

28. బాలగేయాలు
29. నవోదయం

### కథలు:

30. తీరినభయం

### నవలలు:

31. సుహాసినీహాసం (సాంఘికం)
32. రాజరాజప్రశస్తి (చారిత్రికం)
33. ఆత్మార్పణం(చారిత్రికం)

### నాటకం:

34. పదకవితా పితామహుడు (అన్నమాచార్యజీవితచరిత్ర )

### ముద్రణలో:

1. అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు: తులనాత్మక అధ్యయనం
2. పదసాహిత్య పరిమళం
3. కాటమరాజు విజయం
4. పునర్యౌవనం(నాటికలసంపుటి )
5. గురుపూజ(వయోజనవిద్య)